పడతి జీవితానికి పసుపుకుంకుమే పరమావధి! ఆ సౌభాగ్యాన్ని నిలబెట్టడానికి
మూడుదారులు పట్టిన ముగ్గురి జీవితాల మూగబాధే యీ గాథ!




శ్రీ కృష్ణసాయి ఫిలింస్...

# మనసే మందిరం

కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: శ్రీధర్
నిర్మాత: యర్రా అప్పారావు

స్టూడియో:
శ్రీ సారథి స్టూడియోస్
(హైదరాబాద్)

...శ్రీ ఫిలింస్...

(NVRR

# ఉత్తరాలు

### కథలు

గార్డు గోపాలం రచయిత శ్రీ యర్రంశెట్టి శాయిగారు నేటి రైలుబండ్ల పరిస్థితిని చాలా చక్కగా చిత్రించారు. వారి కథలో కొన్నివాక్యాలు నాకు అర్థం గాలేదు. 23 వ పేజి రెండవ పేరాలోని "ఆఫీసుని అడగ్గానే లీవు దొరికినంత సంతోషం" అక్కడ "ఆఫీసరుని అడగ్గానే లీవు దొరికినంత సంతోషం" అని ఉండాలని నా అభిప్రాయం. ఇక పోతే 24 వ పేజీ మొదటి పేరా "వారంరోజుల క్రితమే పార్సిల్, క్విక్ డిస్పాచ్ లేదని లవ్ లెటరొచ్చింది ఆఫీసు నుంచి" అసలు ఈ వాక్యంలో లవ్‌లెటరు అన్న పదానికి అర్థం ఏమో నా కవగతం కావడంలేదు. దయచేసి రచయితగారు నా సందేహాన్ని తీర్చగలరని ఆశిస్తున్నాను.

* * *

ఆరిగపూడి రచించిన "గంజి—అన్నం" అనువాద కథ చదివాను. చక్కగా ఉంది. అధికారుల విలాసకార్యములు వారిని సంతోష పరచుటకై గ్రామప్రజ పొందు బాధలను చక్కగా చిత్రించారు. రంగయ్య, ఆఫీసరు ఈ రెండు పాత్రలు రెండు రకములయిన వ్యక్తిత్వములకు గుణాలకు ఆలంబనములు. శ్రీ చంద్రమౌళిగారి అనువాదంలో కొన్ని వాక్యాలకు పొత్తు కుదురలేదేమో అనిపిస్తుంది. 41 వ పేజి 2 వ వరుస రెండవ పేరాలో "రంగయ్య తన గుడిసె వెనకాల వో కోడిని చంపి" అనే వాక్యంవల్ల అతడు దొంగతనం గావించిన కోడిని చంపినట్లు విదితమవుతుంది. "గిన్నెలో పెట్టిన కోడి 'కూకూ' అని సంతోషాన్ని ప్రకటిస్తున్నట్లు అరవసాగింది" అని 41 వ పేజి మొదటివరుస 4 వ పేరాలో వ్రాశారు. 40 వ పేజీలో చంపబడిన కోడి కూకూ అని అరవడం ఏమిటి? ఈ పొరపాటు అనువాదకునిదో లేక ఆరిగపూడి వారిదో రచయితలు ఈ పొరపాటును సహృదయంతో తెలుసుకొనగలరని ఆశిస్తున్నాను.

జె. గోవిందచౌదురి, అనంతపూర్—2.

### వనితాలోకం

విశాఖగారు వ్రాసిన "చదువులూ అభిప్రాయాలూ" వ్యాసం చదివాము. కాని వారితో మేము పూర్తిగా ఏకీభవించలేకపోతున్నాము. స్త్రీలు తమకంటే తక్కువ చదివిన పురుషుణ్ణి వివాహం చేసుకోవటానికి సమ్మతించరని వ్రాశారు. అసలు పురుషుడు తన కంటే ఎక్కువ చదివిన స్త్రీని వివాహమాడటానికి సమ్మతిస్తాడా? మెట్రిక్ చదివిన తరువాత వేరే ఏదైనా చదువవచ్చునని వ్రాశారు. కాని మన మున్న ఊరిలో తగు సౌకర్యము లేకపోతే ఏం చేయాలి? పైవూరు వెళ్లి చదువుటకు సాధారణంగా, ఇంట్లో వాళ్లు ఒప్పుకోరు కదా! చదువు కొనటానికి ఎన్నోరకాల విద్యలు వున్నాయని మాకూ తెల్సు! కాని అందరికీ అవకాశాలుంటాయా? ఏది ఏమైనా ఈ వ్యాసం అంత తృప్తికరంగా లేదు!

విహారి, శాలివాహన గార్ల 'కథ అడ్డం తిరిగింది' చాలా బావుంది.

'లక్ష్మిపతి' కథ బాగానే ఉంది. కాని ఈ కాలంలో కూడా లక్ష్మిపతి లాంటివారు ఉంటారా! రత్న, మెహర్, (ఆకివీడు)

### వ్యాసాలు

వనితాలోకంలో "సమాజంలో గ్రామ సేవిక ఎదుర్కొనే సమస్యల"ను గూర్చి రవిగారు వ్రాసిన వ్యాసం చాలాబాగుంది. మగవారైనా, నిజంగా గ్రామసేవిక పడే బాధలను కళ్లకు కట్టినట్లుగా వ్రాసి, చదివే వారికి మనసు కదిలించి వేసేటట్లు వ్రాసినందుకు వారికినాధన్యవాదాలు.

నిజంగా బ్లాకుల్లో గ్రామసేవిక పడే పాట్లు పడివారికే తెలుస్తున్నవి. ముఖ్యంగా మహిళా మండలికి రమ్మంటె జరిగేవిమర్శ, భర్త ఉన్న యువ్వనవతి ఐన స్త్రీ, పెండ్లిగాని స్త్రీని గురించి వ్రాసిన విషయాలు అక్షరాల జరుగుతున్నవే. కొంతవరకు పల్లె ప్రజలు మారాలంటే ఈలాటి వ్యా-యింకా కొన్ని వ్రాస్తూ ఉండాలి.

పి. లక్ష్మితులసి (వసుమ్రగ.

* * *

'సమాజంలో గ్రామ సేవిక ఎదుర్కొ-సమస్యలు' అన్న "రవి" గారి వ్యాసము చదివాను. చాలా సంతోషము. 'గ్రామసేవిక' సమస్యలపట్ల అత్యంత సునిశిత ధోరణిలో శ్రీ 'రవి' గారి రచన సాగిందనుటలో అతిశయోక్తి ఎంతమాత్రములేదు.

సోదరీమణుల సమస్యలు సోదరీమణుల అనాదరణవల్ల ఎంతటి జటిల స్వరూపము దాల్చుతున్నది కూడా చక్కగా వివరించబడినది.

వారు పేర్కొన్నట్లుగా ఇంకా 'గ్రామ సేవిక' సోదరిమణులలో ఆత్మ విశ్వాస గాఢముగా యుండబట్టే ఈ కలుషిసాంఘిక వ్యవస్థలో భారతనారిగా గ్రామ సేవిక పని చేయగలుగుతోంది.

హరిజన స్త్రీ కార్యకర్తగా పనిచేయుటకుగల ఇబ్బందులను వారు వివరించిన తీరు, సాంఘికవ్యవస్థలో మతాతీతవాతావరణము, కులాతీతవాతావరణము ఎంత అవసరమన్న విషయము స్పష్టీకరించబడినది.

శ్రీ 'రవి' గారికి వాతరఫున, మా రాష్ట్ర సంఘము తరఫున అభినందనలు అంద జేయవలసినదిగా కోరుతున్నాను.

బండి వెంకటేశ్వరరావు, ప్రధానకార్యదర్శి.
ఆంధ్ర ప్రదేశ్ గ్రామస్థాయీ కార్యకర్తల మరియు గ్రామసేవికల సంఘము.
(తెనాలి)



నవజ్యోతి ఫిలిమ్స్
అడుగుజాడలు
స్క్రీన్‌ప్లే & డైరెక్షన్: చాణక్య * సంగీతం: మాస్టర్ వేణు
నిర్మాతలు: M.సాంబశివరావు-G.వందనం
మాటలు
సముద్రాల (జూనియర్)
కెమెరా
అన్నయ్యా
కళ
కృష్ణారావు
కూర్పు
మార్తాండ్
నృత్యం
వేణుగోపాల్
వాణీ రిలీజ్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# 1966 దీపావళి కథల పోటీ

ఎప్పటివలే ఈ సంవత్సరం కూడా 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి కథల పోటీ' నిర్వహించబోతున్నదని తెలుపటానికి సంతోషిస్తున్నాము. కథకులందరూ ఎప్పటివలే మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

## మొదటి బహుమతి రు. 1100

## రెండవ బహుమతి రు. 750

## మూడవ బహుమతి రు. 500

## నిబంధనలు

1 కథలు స్వంత రచనలయి ఉండాలి ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంత రచనేననీ, దేనికీ అనువాదంకాని, అనుసరణకాని కాదనీ హామీరాసి పంపాలి ఈ హామీ వేరే కాగితంమీద కాక కథ వ్రాతప్రతిమీదనే రాసిఉండాలి

2 కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3 వ్రాత ప్రతిమీద 'దీపావళి కథల పోటీకి' అని స్పష్టంగా రాయాలి కాగితానికి ఒకవైపు మాత్రమే సిరాతో రాయాలి రచయిత పేరు, పూర్తి చిరునామా కూడా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాలి రచనలు 12 అరఠావు (ఎక్సర్సయిజు నోట్ బుక్ పేజి రెండురెట్లు) పేజీలకు మించరాదు

4 కవరుమీద ''దీపావళి కథల పోటీకి'' అని స్పష్టంగా రాయాలి పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టివీధి, మద్రాసు—1' కి పంపాలి

5 పోటీ గడువు తేదీ 30—9—1966 ఆ తేదీ తర్వాత మా కార్యాలయం చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము

6 పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా 11—11—1966తేదీ కల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము

7 పోటీ తుది నిర్ణయం ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకుడిదే ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకూ జరపటానికి వీలులేదు

8 వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపటానికి సాధ్యంకాదు పోటీలో పాల్గొనే వారు తమ రచనలతో తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవర్లు పంపనవసరంలేదు

9 పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆవిషయం ప్రచురించేముందు తెలుపుతాము

## ఉత్తరాలు

''ఆధునిక దినాలలో అతిథులు'' వ్యాసంలో అతిథులు చేసే అగచాట్లకి గృహస్థులు పడేబాధ ను ఎంతో సహజంగా వర్ణించారు రచయిత్రి. కానీ ఈవికాల జగత్తులో వచ్చిన అతిథిని ఆధునిక సత్కారాలతో సత్కరమే సాగనంప ప్రయత్నించే గృహస్థులు కొందరయినా ఉంటారనటానికి మొదట్లో వున్న చిత్రమే చక్కని ఉదాహరణ.

ఎన్నో అవస్థలు పడుతూ, చేతిలో వున్న అడ్రసు కొనుటకి చలివిడయిపోతూంటే వాడవాడలు వెతుకుతు చివరికి అసలు వారింటికి చేరినా కాఫీ సైనా కుండా నాలుగు మాటలు ఆడీ తన పోర్షను అయిందన్నట్లు విశ్రమిస్తుంది గృహస్థురాలు. ఆఫీసులో వెలగబెట్టేది ఎంత చిన్న ఉద్యోగమయినా ఇంట్లో ఆఫీసర్ రాంకులో వుంటున్న అగృహస్థు పేపర్లో ముంచిన తల తీయకుండానే ''ఏమోయ్! ఎప్పుడొచ్చావ్? ఉంటావా రెండ్రోజులు?'' అనేసి ''ఇదిగో! ఎంతవరకయింది? నేవెళ్లాలి'' అంటూ వంటింట్లోకి దారితీస్తాడు అవతల ఆఫీసుకి గంట మ్రోగుతున్నాసరే ఇక ఏడాది చంటిపిల్ల దగ్గర్నుంచి పదహారేళ్ల పసివాడి వరకు అందరూ తలుపు సందుల్లోంచి నక్కి నక్కి చూస్తూ వుంటారు! . చొరవచేసి రమ్మని పిలువబోతే మాంత్రికుడితో పనిలేకుండానే మాయమవుతూ వుంటారు ''అదేమిట్రా! పిలుస్తూంటే అలా పారిపోతారు? ఎవరోకాదు మీకు ఫలానా అవుతాడ''ని నచ్చచెప్పడానికి నుతరాము. ఇష్టపడదు ఆ గృహిణి. పైగా అలవాటయి దగ్గరకొచ్చి కూర్చుని కబుర్లు చెపుతున్న పిల్లలిని ఒక్క కేక పెడుతుంది— బోనులో వున్న సింహం అరచినట్లు.— ''ఏమిటి ప్రొద్దస్తమానం ఆవాగుడు?'' ఉంటాడులే రెండ్రోజులు ఇక నడవండి బడికి ప్రక్కగదిలోంచి సూదుల్లాంటి మాటలు చెవుల్లోంచి పోయి హృదయానికి గ్రుచ్చుకుంటాయి ఇక ఆయింట్లో రెండ్రోజులు కాదు రెండు క్షణాలు కూడ ఉండ బుద్ధి కాదు సామానంతా సర్దుకుని రిక్షాకోసం ఎదురుచూస్తూవుండగా, ఇక ఏమాత్రం ఉండడని నిర్ధారణ చేసుకున్న అగృహస్థులు ''ఏమోయ్ అప్పుడే వెళుతున్నావా? సెలవేకదా! రెండ్రోజులుండ రాదూ!'' అంటారు అటువంటివారికి కర్రవిరచినట్లు సమాధానం చెప్పాలని పిస్తుంది కానీ మొహమాటం ఊరుకోమంటుంది

కొన్ని సుస్నిత హృదయులకి ఈరోజుల్లో అప్పుడప్పుడు ఇలాటి అనుభవాలు ఎదురవుతూనే వుంటాయి ఎస్ లక్ష్మి (నరసరావుపేట) ●

## 'అల్లూరి అమ్మణ్ణి'గారిని

వెంటనే మాకు ఉత్తరం

రాయగోరుతాము

• సంపాదకుడు

ఆంధ్రసచిత్రవారపత్రిక

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 23—9—'66
పరాభవనామ సం॥ భాద్రపద మాసం శు॥ నవమి
సంపుటము : 59 సంచిక : 2
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్రవారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 32.00 |
| అర్ధ సంవత్సర చందా | 16.00 |


పైవారమే!
ప్రారంభం
## చిరుద్యోగపర్వం
చిన్నసీరియల్
రచన:
లేళ్లపల్లి
వెంకటలక్ష్మీనారాయణ

# మనలో మాట

నిరుద్యోగపర్వంతో పాఠకులకు సుపరిచితులైన శ్రీ లేళ్లపల్లి వెంకట లక్ష్మీనారాయణగారు రాసిన మరో చిన్న సీరియల్‌కి సంబంధించిన ప్రకటను యిదే పేజీలో చూడవచ్చు...

* * *

మంగుళూరు సమీపంలో ఉన్న కద్రిలోని చరిత్ర ప్రసిద్ధమైన మంజునాథస్వామి దేవాలయాన్ని గురించి శ్రీ ఎస్. రామకృష్ణ రాసిన వ్యాసాన్ని మధ్య పేజీలలో వేశాము...

* * *

తెలుగు చిత్రసీమలో పురోభివృద్ధి సాధిస్తున్న కొత్త తారలను గురించి తెలుసుకోవాలనే ఉత్సాహం ఉన్న పాఠకులకు ఈ సంచికలోని 48,49 పేజీలు ఒక వర్ధమాన తారను గురించిన వివరాలను అందిస్తాయి...

* * *

త్వరలో ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు అందించే ఒక కొత్త ఆకర్షణకు సంబంధించిన ప్రకటనను ఇదే సంచికలో చూడవచ్చు...

* * *

రచనలు పంపేవారు తమ చిరునామాలను, హామీ పత్రాలను విడిగా కాకుండా రచన ఉన్న పేజీలలోనే రాయవలసినదిగా కోరుతున్నాము...

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'శ్రీమతి'లో శారద

# శుష్క వాదాలు

సెప్టెంబర్ 9 వ తేదీన ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి ఒక ప్రకటనచేశారు "నేను సూచించిన అభ్యర్థిని శ్రీ సంజీవ రెడ్డి ఒప్పుకుంటారు అని అప్పుడు కాంగ్రెసు అధ్యక్షులు చెప్పి ఉన్నారు దాన్ని అనుసరించి ఆగస్టు 18 న సమావేశం వాయిదా పడింది అందువల్ల ఆ తీర్మానంలో సూచించిన ప్రకారం నేను సూచించిన అభ్యర్థినే ఏకగ్రీవంగా ఎన్నికల సంఘంలో 11 వ స్థానానికి రాజీ అభ్యర్థిగా ఎన్నుకొనవలసివుంటుంది ఇదిసంభవం కానప్పుడు పోటీ జరిగితీరుతుంది పోటీ జరిగితే ఫలితం విశదమే"

విశదం కనుకనే సెప్టెంబర్ 29 వ తేదీన ఎన్నిక జరుగగలదని కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామరాజు ప్రకటించినా సిండికేట్ వర్గంవారు — కొందరు ఇంకా "రాజీ" గురించి మాట్లాడుతున్నారు అంతే కాక, శ్రీయుతులు వి బి రాజు, జె వి నరసింగరావు తదితరులు సభ్యత్వాలని గురించి, శ్రీమతి రుక్మిణమ్మ సభ్యత్వం గురించి వాద వివాదాలు పెంచు కున్నారు ఈ వివాదాల విషయమయి (ఈ వ్యాసం అచ్చు అయే సమయానికి) శ్రీ కామరాజ్ స్పష్టంగా తమ నిర్ణయాన్ని ప్రకటించలేదు అందువల్ల ఇది జరిగే వరకు సిండికేట్ వర్గాల వాదాలని కేవలం శుష్కవాదాలనే భావించవలసి ఉంటుంది శ్రీ వి బి రాజు సభ్యత్వం విషయమయి వచ్చిన అభ్యంతరం, ఆయన కొన్ని నెలల క్రితమే తమ పదవికి ఇచ్చిన రాజీనామా దృష్ట్యా. అంత ముఖ్యమయినది కాదని గ్రహించవచ్చు అసలు శ్రీ రాజు సభ్యత్వం గురించి శ్రీ సంజీవరెడ్డివర్గం వారు చెప్పే అభ్యంతరం నిష్కర్షగా వర్తిస్తే—శ్రీ రాజు రాజీనామా ఎలాగూ ఇచ్చారు కనుక ఆయన విషయంలో ఇది ఫరవాలేదు—తక్కిన రాష్ట్రాలలో ఎందరి సభ్యత్వాలకో అభ్యంతరాలురావచ్చు కేవలం ఒక 'చీలిక వర్గం' వారిసంతృప్తి కోసం ఇటువంటి సమస్యని లేవతియ్యటం మంచిదా కాదా అనేది వివాదాస్పదం

ఫరవాలేదని ఆగస్టు 18 వ తారీకున సమావేశమయిన పి సి ఎ సభ్యుల మెజారిటీ తీర్మానం వెల్లడి చేసింది అయినప్పటికీ శ్రీ బ్రహ్మానందరెడ్డి కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామరాజ్ పట్ల గౌరవంతో ఆయనని వత్తిడి చెయ్యలేదు శ్రీ సంజీవరెడ్డి ఆయన అనుచరులు కొందరు ముఖ్యమంత్రి అభ్యర్థిని స్వీకరించి పోటీ తప్పించటానికి సిద్ధంగా ఉన్నారని వినికిడి కాని, తక్కిన సిండికేట్ సభ్యుల్లో కొందరు పోటీ జరిగి తీరాలని పట్టుబడు తున్నట్లు కూడా వింటున్నాము ఆగస్టులో, ఎన్నిక జరగరాదని చేసిన ప్రచారానికి ఇది విరుద్ధంగానె ఉంది! దీనినిబట్టి



శ్రీ బ్రహ్మానందరెడ్డి



శ్రీ కామరాజ్



శ్రీ సంజీవరెడ్డి

వీటి సంగతి అలా ఉంచి నేడు 'సిండికేట్' ధోరణి పరిశీలిస్తే కొన్ని కొత్త పరిణామాలు కనిపిస్తాయి శ్రీ సంజీవరెడ్డి గారు ముఖ్యమంత్రి అభ్యర్థిని అంగీకరిస్తామని ముందే అన్నట్లు వార్తలు వెలువడ్డాయి ఆయన అంగీకరించకపోయినా కొందరు కాంగ్రెసు 'నాయకులు' మరి కొందరు కాంగ్రెసు నాయకుల మధ్య విరోధాలు, చీలికలు పెంచటమే తమ ధ్యేయమని తలుస్తున్నట్లు అనుమానించవలసి వస్తుంది ఏవేవో కారణాలవల్ల కొన్ని పదవులని అలంకరించలేని రాజకీయ నాయకులు ఆ పదవులలో తాము చెప్పినట్లు వినయ విధేయతలతో నడుచుకునేవారిని పెట్టాలని ఎన్నో ఉపాయాలని ప్రయోగిస్తారు ఒరిస్సాలో ప్రస్తుతం జరుగుతున్న నాటకమే దానికి నిదర్శనం ఇటువంటి నాటకాలు ఆడించే వారి బలానికి ఎదురులేకపోయినప్పుడు వారి కుతంత్రాలు మాత్రమే బయటపడ్డాయి. బలం లేకుండా నాటకం [illegible] వారు నవ్వులపాలు కావచ్చు!



అవీ-ఇవీ .

## మద్రాసులో నాటకపోటీలు

1967 జనవరి 5వ తేదీ నుంచి 10వ తేదీ వరకూ నెల్లూరు ఫిలిం క్రిటిక్సు అకాడమీ ఆధ్వర్యాన మద్రాస్ టి నగర్ వాణి మహల్లో నాటక, నాటిక, ఏకపాత్రాభినయ పోటీలు జరుగనున్నాయి ప్రతిరోజూ కార్యక్రమాలను సినిమా పరిశ్రమలోని నటీనటులు, దర్శక, నిర్మాతలు తిలకిస్తారు. దరఖాస్తు ఫారాలకు, యితర వివరాలకు నెల్లూరు ఫిలిం క్రిటిక్సు అకాడమీ ఎన్. బి వీధికి వ్రాయవలెను

### వి వా హం

శ్రీ దగ్గుబాటిలక్ష్మీనారాయణ(శ్రీశంభు ఫిలింస్) కుమార్తె చిరంజీవి పద్మాలయా దేవికి చిరంజీవి సుధాకరుకు ఆగస్టు 28వ తేదీ ఉదయం మద్రాసులోని సఫైర్ థియేటర్‌లో వైభవంగా వివాహం జరిగింది. చిత్ర పరిశ్రమలోని పలువురు ప్రముఖులు, పత్రికా విలేఖరులు, తదితర పెద్దలు వివాహానికి విచ్చేసి వధూవరుల నాశీర్వదించారు

## ఆగ్నేయ రైల్వే క్రొత్త జనరల్ మేనేజరు

ఆగస్టు 24 వ తేదీన శ్రీ జగ్‌జిత్‌సింగ్ ఆగ్నేయరైల్వే జనరల్ మేనేజర్‌గా పదవీ స్వీకారం చేశారు ప్రాగ్భారత రైల్వేలో వేర్వేరు పదవుల నలంకరించిన శ్రీ సింగ్ మంచి విజ్ఞానవేత్త, రచయితకూడాను 'గణితసూత్రాలు, స్వభావాలు—వాటి రోజువారీ ప్రయోజనాలు', 'ఆధునిక విశ్వవిజ్ఞానం', 'ఆధునిక ప్రపంచం—సంస్కృతీచరిత్ర మొదలైనవాటిపై చక్కని రచనల్ని వీరు ప్రచురించారు శాస్త్ర విజ్ఞానాన్ని జన వ్యాప్తం చేసినందుకుగాను 'యునెస్కో' సంస్థ వీరికి 1963 లో 'కళింగాప్రైజు'ను బహూకరించింది ఆసియా నివాసిగా ఇటువంటి బహుమానాన్నందుకున్న ఘనత వీరి కొక్కరికే దక్కింది శ్రీ సింగ్ కొంత కాలం 'ఆపరేషనల్ రీసెర్చ్' లో భారత ప్రభుత్వసలహాదారుడుగా వున్నారు 'రాయల్ స్టాటిస్టికల్ సొసైటీ' ఫెలోగాను, 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేథమెటికల్ స్టాటిస్టిక్స్' సభ్యుడుగాను వుంటూ, భారత రైల్వే తరపున అంతర్జాతీయ సమావేశాలకుకూడా వీరు ప్రాతినిధ్యం వహించారు ●





# Nital

**MEDICATED PIMPLE CREAM**

**(నిటాల్ మొటిమల మందు)**

రూ 1 90 మాత్రమే

**7 రోజులు వాడితేనే చాలు**

## క్రిమిసంహారక పదార్థాలతో తయారుచేయబడిన నిటాల్‌ను డాక్టర్లు సిఫారసు చేస్తారు. చర్మానికి హాయిని చేకూర్చి, శుభ్రపరుస్తుంది.

★ చక్కని సువాసన.

నిటాల్ మొటిమల మందు సురక్షితంగా హాయిగా, పూర్తిగా మొటిమలను తొలగిస్తుంది చర్మంలోనికి పోయి, మున్ముందు తిరిగి మొటిమలను లేవకుండా చేస్తుంది లోపలికంటా పోవడంచేత మొదలంటా మొటిమలను తీసివేస్తుంది మొటిమలు ఎండి పడిపోగలవు దీన్ని వాడిన తర్వాత ఇతర దోషాలేమీ వుండవు మచ్చలుగాని గుంటలుగాని పడవు

యువతీ యువకులందరూ వాడవచ్చు చర్మాన్ని శుభ్రపరచి, మనసు తేల్చి నిగనిగలాడుతూ యౌవ్వనం ఉట్టిపడేటట్లు చేస్తుంది



ఉత్పత్తిదారులకు వ్రాస్తే వివరాలు తెలిపే కరపత్రం పంపగలరు

ఉత్పత్తిదారులు:

**కొచ్చిన్ సామ్ ప్రైవేట్ లిమిటెడ్**

నవరత్న భవన్, ముల్లా రోడ్, కొచ్చిన్ 2.

Graphic CPT




ఆ పెద్ద భవనం మూడో అంతస్థులో బాల్కనీలో నిలబడి శేఖర్ ఏకదీక్షగా అనూరాధ వైపు చూశాడు. సంవత్సరం నుంచి అతను ఆమెని ఎన్నివందల సార్లో అలాగే చూసినా ఇంకా తనివి తీరలేదు. జన్మాంతం అలా చూస్తున్నా అతని ఆనందానికి హద్దు ఉండదని అతనికి తెలుసు. తనకి ప్రపంచంలో—జీవితంలో ఉన్న అన్ని సిరి సంపదల్నీ—అందరు మనుషుల్నీ ఒక్కనిముషంలో అతను ఆమె కోసం త్యాగం చెయ్యగలడు.

అలాటి త్యాగమేమీ అడిగే మనిషికాదు అనూరాధ. ఆమె మనస్సులో శేఖర్ కన్న విలువైన సిరికానీ సంపదకానీ ఏమీలేదు. ఈనాడు ఆమె వంటి మీద మెడలో గొలుసూ చెవులకి రింగులూ తప్ప ఏ అలంకారమూ లేదు. కాని ఆమె ఎంతో అందంగా ఉంది. అంత కంటె ఎన్నోరెట్లు అందంగా అతనికి కనిపిస్తోంది.

"నీ పుట్టినరోజుకి నీ నగలన్నీ పెట్టుకుని అలంకరించుకుంటావని అనుకున్నాను" అన్నాడు శేఖర్ మందహాసంతో.

"మీరు చెప్తే అలాగే చేస్తాను కానీ ఎందుకో ఆ నగలంటే మహావిరక్తి పుట్టిపోయింది." అంది అనూరాధ.

"నీ విరక్తికి కారణం తెలుసు అనూరాధా! నీ నగలకన్నా నువ్వెంతో అందంగా ఉంటావ్. ఏమీ వొద్దుకానీ కనీసం ఆ వజ్రాల దుద్దులు పెట్టుకోకూడదూ?"

"అవి మెరిసినప్పుడల్లా మీరు నాకళ్ల వేపు చూడటం మానేస్తారా? ఈ రింగులు చేయించుకోడానికెంత బాధ పడవలసి వొచ్చిందో మీకు తెలుసును—నా చెవులకి వజ్రాలు తప్ప పనికిరావని మీ పట్టుదల! ఇవాళ నా పుట్టినరోజు కదా, ఇవే ఉంచుకోనివ్వండి." అంది అనూరాధ.

అతను ఆమెని నెమ్మదిగా దగ్గరకు తీసుకున్నాడు.

"నీ మాట ఎప్పుడూ చెల్లుతుంది అనూరాధా! నీ పుట్టినరోజుకి ఏదో ఒక బహుమతి యివ్వాలికదా, ఒక్కసారి తిరిగొద్దాం." అన్నాడు శేఖర్.

ఆమె తల ఊపి తెర తీసి గదిలోకి వెళ్లి ఐదు నిముషాల్లో తిరిగి వొచ్చింది.

"చెప్పు మెర్సిడే కారులో వెళదామా లేకపోతే కొత్త ఫియట్‌లో పోదామా?"

"రెండూ వొద్దండీ. ట్రాములో వెళ్దాం." ఆశగా అతని వేపు చూస్తూ చిరునవ్వుతో ప్రేమతో మెరుస్తున్న కళ్లు అతని వైపు తిప్పి అంది అనూరాధ.

అతను కొంచం బాధపడినట్లు.."ఏం కోరిక రాధా! నీ పుట్టినరోజు నాడు కూడా ట్రాములో ఎక్కాలా?" అన్నాడు.

"ఇవాళ నా మాటకి ఎదురు చెప్ప కూడదు మీరు. ఏం?" అంది అనూరాధ.

"ఏరోజూ నీ మాటకెదురు చెప్పన

రాధా, పద." అని తమె చెయ్యి పట్టుకుని అతను బయటకు వొచ్చాడు మెట్లు దిగి

"పోనీ ట్రామ్ స్టాప్ దాకా కారులో వెడదామా?"

"వొద్దండీ."

అయిదు గంటలైపోయినా ఇంకా ఎండ బాగా తగ్గలేదు. ట్రామ్ స్టాప్ చేరేసరికి రాధ ముఖం కొంచం ఎర్రబడింది. అది గమనించి శేఖర్ కనీసం గొడుగైనా తేనందుకు బాధపడ్డాడు.

ట్రాము వొచ్చేసరికి మరో పది నిమిషాలైనా అదృష్టంకొద్దీ ట్రాము ఖాళీగానే ఉంది. ఎక్కి ఇద్దరూ న్యూ మార్కెట్ చేరుకున్నారు. ముందర బట్టల దుకాణాల వైపు వెళ్లేరు. ఒక దుకాణం విండో ఏడెనిమిది చీరెలు డిస్ప్లే చూసి అనూరాధ ఆగింది. అతనామె పక్కన నిలబడి చీరల్ని జాగ్రత్తగా పరిశీలించాడు. ప్రతిచీర మీదా ఖరీదు వేసిన కాగితం అతికించబడి ఉంది. కనీసపు ఖరీదు రెండువందల ఎనభై రెండు రూపాయలు. అన్నిటికన్నా ఖరీదైనది, తొమ్మిది వందల అరవై రూపాయలు.. ఐదారు నిముషాలు వాటన్నిటినీ పరిశీలనగా చూసి "పదండి" అన్నది అనూరాధ.

"వీటిలో ఏ ఒక్కటీ నచ్చలేదా రాధా?"

"లేదండీ...అవి మామూలు చీరెలు. అదీకాక వీటికిప్పుడు అవసరమేముంది?"

"నీ యిష్టం రాధా! కాని యివేళ నీకు నిజంగా యిష్టమైనది ఏదో ఒకటి ఎంచుకోవాలి నాశక్తి నీకు తెలుసు" అన్నాడు శేఖర్.

ఎంతో అందంగా నవ్వి "మీ శక్తి తెలుసును కనకనే యీ రకం చీరెలు నేను తీసుకోడంలేదు. ఇంకా మిగిలిన దుకాణాలు చూద్దాం పదండి." అంది అనూరాధ.

ఈసారి సురాణామల్స్ షోవిండో దగ్గర ఆగారిద్దరూ. లోపల రకరకాల నెక్లెస్‌లూ, ఉంగరాలూ, గాజులూ ఎంతో చక్కగా కనిపిస్తున్నయ్. వాటన్నిటితో రాధకి ఆరాధన చెయ్యాలని అనిపించింది శేఖర్‌కి. కాని ఆమె కళ్లల్లోకి చూడగానే ఆ కోరిక వ్యక్తం చేసేటందుకు అతనికి మాటరాలేదు. అలాటి వస్తే పిచ్చి ఊహలని రాధ కొట్టి పారేస్తుందని అతనికి తెలుసు. ఆమె అక్కడి నుంచి దారి తీయడం చూసి "ఇందులో ఏ ఒక్కటీ నీకు నచ్చలేదా రాధా?" అన్నాడు శేఖర్ ఆశగా. రాధ తల అడ్డంగా తిప్పింది. "ఈ నగలు పెట్టుకుంటేకాని మీకు బావుండనా? అలా అయితే చెప్పండి..."

"ఇవాళ నువ్వు నాకు ఎంత అందంగా కనిపిస్తున్నావో చెప్పడానికి మాటలు కూడా నాకు లేవు." ప్రతిరోజూ లాగే అన్నాడు శేఖర్. అనూరాధ సంతృప్తిగా చేసిన మందహాసం ఆమె కళ్లల్లో మాత్రం అతనికి కనుపించింది. ఆమె చేయి పట్టుకుని అతను ఒక ఫ్యాన్సీ దుకాణానికి వెళ్లేడు. అక్కడ షోవిండోలో చక్కటి పార్కర్ పెన్ సెట్ చూసి "ఇది చూడు రాధా! నీకు నచ్చితే చెప్పు..." అన్నాడు శేఖర్.

"దీనికన్న ఎంతో మంచి పెన్ను నాకు ఉందని మీకు తెలుసు. అదీకాక 51—పాత బడిపోయింది. నిజానికి 71—కూడా పాత బడిపోయింది. పి. ఎస్. వీళ్ల దగ్గరలేనే లేదు. పదండి" అని అతన్ని కొంచం బలంగా లాక్కుని వెళ్లింది.

న్యూమార్కెట్‌లోంచి బయటకొచ్చి, నడిచి చౌరంగీ చేరుకున్నారు. గ్రాండ్ హోటల్ ఆర్కేడ్‌లో ఆగి

"పోనీ లోపలకెళ్లి కాఫీ తాగుదామా?" అని ఆశగా అడిగాడు శేఖర్.

"ఇక్కడ కాఫీ నాకు నచ్చదని మీకు తెలుసుగా? అదీకాక మీరు వెళ్లగానే హోటల్ స్టాఫ్ అంతా మన కోసమే పరుగు పెడతారు. అది నాకు నచ్చదు. ఇవాళ మనం ఇద్దరు సామాన్యుల్లాగ నటిద్దాం. ఏం?" అంది అనూరాధ.

"సరే రాధా. చెప్పు ఏంచేద్దామో."

"కొంచంసేపు ఇక్కడే తిరుగుదాం. ఆ తరవాత ఇంటికి వెళ్లిపోదాం."

"మరి నీకు బహుమతి?"

"నాకు బహుమతి మీరే!"

"అలాక్కాదు రాధా! నువ్వేదో ఒకటి ఇవాళ కోరుకుని తీరాలి. మనం ఒక నాటకం ఆడుతున్నామని నాకు తెలుసునులే కాని దానికి ఏదో ఒక హద్దు ఉండాలి. నా సంతృప్తి కోసం నీ యిష్టం వొచ్చినది కొను."

"సరే" అంది అనూరాధ. ఆ పక్కనే ఒక బట్టల దుకాణం ఉంది. అక్కడ విండోలో చక్కని వాయిల్ చీరలున్నాయ్. అందులో ఒకటి లేత అకుపచ్చ రంగులో ఆమెకెంతో అందంగా కనిపించింది. అతని కది చూపెట్టి "మీ దగ్గర చాలినంత డబ్బుంటే ఆ చీర, దానికి మాచ్ అయ్యే బ్లౌజు పీసూ కొనండి" అంది అనూరాధ.

అతని ముఖంలో ఎంతో ఆశ్చర్యం కనుపించింది.

"ఇదేనా రాధా నువ్వివాళ కొనేది?" అన్నాడు కొంచం బాధగా.

"మీరు నాతో వాదించనని చెప్పేరుగా నాకు యీ చీరే కావాలి." అని నిశ్చయంగా చెప్పి మళ్లీ మార్దవంగా కొంచం హాస్యంగా "మీ దగ్గర డబ్బు లేకపోతే మాత్రం ఒద్దులెండి" అంది. అతనూ సీరియస్‌గా జేబులోంచి నోట్లు తీసి లెక్కపెట్టి—

"ఫరవా లేదులే. సరిపోవొచ్చు." అన్నాడు. ఇద్దరూ దుకాణంలోకి వెళ్లి ఆ చీరకొని ప్యాకెట్ తీసుకుని ఇవతలకు వచ్చారు.

"నువ్వలిసిపోయావ్ రాధా, ఇలాగ తిరగడం నీ కలవాటు లేదు టాక్సీ పిలుస్తాను. ఇంటికి పోదాం." అన్నాడు.

"ఒద్దండీ. టాక్సీ వొద్దు. నాకు ట్రాములంటే ఎంతో యిష్టం ట్రాములోనే పోదాం."

ఆమె పట్టుదల చూసి యిష్టం లేకపోయినా ఒప్పుకుని అతనామెని ట్రామ్ స్టాప్‌కు తీసుకెళ్లేడు అక్కడే అమ్ముతున్న చక్కటి మల్లిపూలు కొని ఇద్దరూ ట్రామెక్కేరు.

* * *

శేఖరం, రాధా ఇంటికి చేరేటప్పటికి బాగా చీకటి పడింది. తలుపు తాళం తీసుకుని గదిలో దీపం వేసి అతను ఆ గదిలో ఉన్న ఒక్క కుర్చీలో మెల్లగా కూర్చున్నాడు. రాధ ముఖం కళుక్కు వచ్చింది.

"అలసి పోయావా?"

"కాదురాధా, మన నాటకం తలుచుకుని బాధ పడుతున్నాను, నవ్వు కుంటున్నాను."

"ఆ. మళ్లీ నిజంలోకి వచ్చాం అయినా అంత సిరిసంపదలు మన కెందుకండీ?" అంది అనూరాధ.

ఆమె చిరునవ్వు ఒక్కనిముషం కూడా అదృశ్యం కాలేదు. అతను లేచి నిలబడి తెచ్చిన మల్లిపూలు ఆమె నెత్తినపోసి ఆప్యాయంగా కౌగలించుకుని "మనకి యీసంపద చాలు రాధా!" అన్నాడు.

ఆమె చాలాసేపు మాట్లాడలేదు. దుఃఖం ఆపుకునే ప్రయత్నంతో. ●

# మీ జుత్తును ఆరోగ్యంగా నిగనిగ లాడేలాగు వుంచుతుంది

# బ్రిల్‌క్రీమ్

సర్వోత్తమ హేర్-డ్రెస్సింగ్

కేవలం బ్రిల్‌క్రీమ్ మాత్రమే

- చక్కగా జుత్తు దువ్వుకోవడానికి సాయపడుతుంది. జుత్తు జిడ్డు కాదు, చెదరి పోదు.
- చాలా పొదుపు అయినది. ఒక్కసారి రాస్తే చాలు రోజంతా జుత్తు రేగదు.
- దీనిలో చేర్చిన అద్వితీయమైన మిశ్రమము మాడును పోషించి, జుత్తును బాగా పెంచుతుంది.
- మీ జుత్తు యొక్క సహజ రంగును బయలు పరచును.




**మీరు కూడా బ్రిల్‌క్రీమ్ ఉపయోగించడం మొదలు పెట్టండి**

**ప్రపంచమంతటా లక్షలాది మంది సొగసుకారులు ఉపయోగించేది.**

# అర్ధాంగి



ఉన్నవ విజయలక్ష్మి

జరిగిన కథ

సుదర్శనానికి వైద్యం చేయడానికి అయిష్టాన్ని ప్రదర్శించిన డాక్టర్ హరీష్‌ను ఒప్పిస్తుంది మంజుల. శంకరం పేరొక యువతితో ప్రేమకలాపాలు జరుపుతూ ఆస్తికోసం మంజులను వివాహం చేసుకోడానికి వేసిన పథకాన్ని విన్న హరీష్, మంజులలు ఆశ్చర్యచకితులవుతారు. ప్రేమను వ్యక్తంచేసిన మంజులకు తానాశించిన సమాధానం హరీష్‌నుంచి రాకపోయేసరికి ఖిన్నురాలై వెళ్లిపోతుంది. హరీష్‌కు తన కథనంతా వివరిస్తాడు సుదర్శనం. ఇష్టంలేని పెళ్ళి చేశారనే కోపంతో భార్య శాంతను నిర్లక్ష్యంచేసి జానకిని ఆస్థానంలో తీసుకొచ్చి పెడ్తాడు సుదర్శనం. పాపాయి పెత్తుటుంటుందన్న సుశీల కన్ను మూస్తుంది. అభిప్రాయభేదాలు వచ్చి సుదర్శనం భార్య మంజుల కూడా వెళ్ళుతుంది

## 9

కొడుకు మొహంలోకి చూడలేనట్లు ఇంకా గాఢంగా అతని ఒడిలో కరుచుకుపోయి,

“ఎలాచెప్పను హరీ? నీకు నేనేమని చెప్పను? వారికి మనకి ఎలాంటి బంధుత్వం అని చెప్పను? ఏం సంబంధం వుందని చెప్పను?...... వారు నాసర్వస్వం.”అంది వెక్కిళ్లమధ్య.

అప్రతిభుడైపోయాడు హరీష్ “అమ్మా” ఆశ్చర్యము, దుఃఖము సంతోషము అతని గొంతునొక్కి వేసినట్లయింది. తల్లిని పట్టివున్న చేతులు అప్రయత్నంగానే బిగుసుకున్నాయి. సుదర్శనం గారి దురాగతాలకి మరో ప్రత్యక్ష సాక్షి అన్నమాట ఈవిడ. శాంత, జానకిలని గురించి తప్ప మరో స్త్రీతో తనకి పరిచయం వున్నట్లు ఆయన చెప్పలేదు. నిజమే, ఎన్నని చెప్పగలడు? ఇలాంటి స్నేహాలు తనకు ఎన్ని వుండేవో కూడ ఆయనకే జ్ఞాపకం లేకపోవచ్చు. ఎందరి జీవితాలతో ఆడుకున్నాడో ఎంతమంది అమాయకులని అన్యాయం చేశాడో ఆయనకే గుర్తులేక పోవచ్చు. మోజు తీరగానే ఆయన మరచిపోయినా, జీవితంలో చేసిన పొరపాటుకి శిక్ష అనుభవిస్తూ నిష్ఠురజీవితాన్ని గడుపుతున్న ఓ అభాగ్యురాలు తనకి ఇంత దగ్గరలోనే వున్నదనీ, నేను.............

“నేను ఆ శాంతనే అని నువ్వు నమ్మలేక పోతున్నావుకదూ........?”

వెన్నుమీద ఛళ్ళున చరిచినట్లయింది హరీష్‌కి. గుండె పగిలి పోతుందేమోనన్నంత వేగంగా కొట్టుకోసాగింది.”

“నిజమే, అన్ని వేపుల నించీ అవమానాలు చుట్టుముట్టుతూంటే ఆత్మహత్య ఒక్కటే మార్గం అని వాళ్ళు అనుకుని వుంటారు. నేనేపాపము చేయనప్పుడు వీళ్ళకెందుకు భయపడాలి అనే పట్టుదల నాకసలా ఆలోచనే రానివ్వలేదు. నేనలా బ్రతకటం వాళ్ళు సహించలేకపోయారు. చేయని నేరానికి శిక్ష విధిస్తూ శూలాలలాంటి మాటలతో నాహృదయాన్ని తూట్లు పొడుస్తూ వేటకుక్కలలా నన్ను తరుమసాగారు. నన్ను ఒంటరిదాన్ని చేసి అంతకర్కశంగా ప్రవర్తిస్తున్న నా చుట్టూవున్న మనుష్యుల మీద ఒకలాంటి ద్వేషం, కక్ష పెరిగాయి నాలో. వీళ్ళకి భయపడి లొంగి పోగూడదు. ఎదిరించి ధైర్యంగా నిలబడి నా బ్రతుకు నేను బ్రతకాలి అని నిశ్చయించుకున్నాను. ఆమొండి ధైర్యమే నేను ఇంట్లోంచి అడుగు బైట పెట్టేలా చేసింది. ఆసమయంలోనే ఈ తాతయ్యగారు కనిపించి నాకు ఆశ్రయం ఇచ్చారు”అంటూ ఎదురుగా గోడనున్న సీతాపతిగారి ఫోటో చూపిస్తూ లేచి కూర్చుంది. దుఃఖాన్ని దిగమింగుకునే ప్రయత్నంలో కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి.

“తను వింటున్న దేమిటి—ఒక్కొక్కరి జీవితంలో ఎంత నిగూఢమైన రహస్యాలు నిక్షిప్తమై వుంటాయో వూహించటం కూడా కష్టమే—తన కింకా బాగా జ్ఞాపకం. చిన్నతనంలో ఎన్నిసార్లో నాన్నగారు ఎక్కడున్నారమ్మా, ఎప్పుడొస్తారు అని అడుగుతూంటే అమ్మ మొహం తిప్పుకుని కళ్ళు వత్తుకునేది. తాతయ్యగారు తనని దగ్గరికి పిలిచి, ఏవేవో చెప్పి మురిపించడానికి ప్రయత్నించేవారు. ఎన్ని చేసినా నాన్నగారిని చూడాలనే కోరికని మాత్రం చంపుకో లేకపోయేవాడు తను . అందులో స్కూల్లో తోటిపిల్లలంతా వాళ్ళవాళ్ళ తండ్రులని గురించి చెప్పుకుంటూంటే, ‘మానాన్నగారు ఏమైనారు. మమ్మల్ని వదలి ఎక్కడికి వెళ్ళిపోయారు ఇంకరానే రారా, ఉత్తరాలయినా వ్రాయరేమిటి’ అనుకూంటూంటే తన చిన్నబుర్రకి మెరుపు లాంటి ఆలోచన వచ్చింది. అమ్మా నాన్నగారు చచ్చి పోయారా అని అడిగాడు. అమ్మచటుక్కున తన నోరు మూసేసి “తప్పమ్మా, ఇంకెప్పుడూ అలా అడగకు” అంది వెక్కిళ్ళు పెడుతూ. ఇంకాస్త వయస్సు పెరిగినతరువాత పరిస్థితులని అర్థంచేసుకో గలిగాను—అమ్మచిన్నతనం లోనే జీవితంలో మోసగించ బడింది. తాతగారు ఉదార హృదయులు కనుక తననీ అమ్మనీ ఆదరంగా యింట్లో పెట్టుకున్నారు— అంతే కాదు. తనకూతురిలాగే జీవితంలో దగా పడిన అబలలకి, దిక్కులేని అనాధలకి ఆశ్రయం కల్పిస్తూ ఈ శరణాలయం స్థాపించారు. ఇదీ తనుఏర్పరచుకొన్న

అభిప్రాయం. అందుకే మరెప్పుడు తండ్రిని గురించి ఆయన బంధువులని గురించి అడిగి, గిరాన్ని తవ్వి అమ్మమనస్సు కష్టపెట్టలేదు. కాని, నాతండ్రి ఎవరో నాకు తెలియదు అన్న భావం, ఒకభయంకరమైన రూపంలో తనలో తలఎత్తి అది ఇంతై అంతై, మహావిశ్వమంత అయి తనని పిడికిటలో పెట్టుకుని అవకాశం వచ్చినప్పుడల్లా మెడపట్టి నొక్కుతూ, తన్ను వూపిరి తిరగక విలవిల్లాడేటట్లు చేస్తోంది. అందుకే తనుచేయని నేరానికి శిక్ష అనుభవిస్తూ బ్రతుకులో అడుగడుగునా అవమానాలు ఎదుర్కొంటున్న ఈజీవితానికి, సభ్య, సమాజంతో ఎలాంటి సంబంధము ఏర్పరుచుకొనే అర్హతలేని అనామకుడుగా బ్రతుకవలసి రావడానికీ కారణమైన ఆవ్యక్తిని వూహలలోనే అనుక్షణం చూస్తూ ద్వేషిస్తూండే వాడు ఇప్పుడు ఆవ్యక్తి... ..... ...''

"ఏంబాబు, మాట్లాడవు. నువ్వునన్ను అసహ్యించుకుంటున్నావు కదూ భర్తని వదిలేసిన స్త్రీని లోకం ఎప్పుడూ మెచ్చదు. కన్న కొడుకు దృష్టిలో కూడ నేను లోకువై పోయాను ఇందులో నీతప్పే మీలేదు. నేను నీకు చేసిన ద్రోహం ఇంత అని చెప్పడానికి వీలులేనిది—మీ నాన్నగారు ఫలానాఅనిచెప్పాలనీ ఒకసారి చూసిరమ్మనాలనీ ఎన్నిసార్లో అనుకున్నాను. కాని, నీకు తెలిసిందిగా ఎలాంటి పరిస్థితిలో విడిపోయామో నువ్వు వారిదగ్గరికి వెళ్ళినావారు నిన్ను తనకొడుకుగా అంగీకరించరనీ నువ్వు ఆ అవమానాన్ని సహించలేవనీ భయపడ్డాను'' తిరిగి ఉధృతంగా పొంగివస్తున్న దుఃఖోద్వేగపు తాకిడికి తట్టుకోలేక కంపించి పోతున్న తల్లిని రెండుచేతుల లోనూ పొదివి పట్టుకుని,

"లేదమ్మా లేదు నిన్ను నేనెప్పుడూ అసహ్యించుకోలేదు. నీస్థితికి జాలిపడుతూ నిన్ను గౌరవించడమే నేర్చుకున్నాను ఇప్పుడు నీ కథంతా విన్నతరువాత ఆగౌరవం అభిమానం యింకా ఎక్కువయాయే కాని ఏమాత్రం తరగలేదు.

ఆయన చెప్పిన కథలోని కాంతవి నువ్వే అని తెలిసినప్పుడు శారీరికంగా మానసికంగా నువ్వెంతటి చిత్రహింసకి గురి అయావో వూహించుకుంటూంటే మనస్సు విలవిల్లాడి పోతోంది. మగవాడి అధికారానికి, దురహంకారానికీ బలి అయిపోయిన జీవితం నిది. అలాంటి స్థితిలో, అన్యాయానికీ అపవాదుకీ తలవంచి పిరికి దానిలా జీవితం నుంచి పారిపోకుండా, ధైర్యంగా పరిస్థితుల నెదుర్కోడానికే నిశ్చయించుకున్న నిన్ను చూసి నేనెంతో గర్వపడుతున్నాను. నీఆత్మ స్థైర్యమే నీకు అండగా నిలిచింది'' అన్నాడు తల్లికళ్ళల్లోకి చూస్తూ. ఆమెయెడ భక్తి ప్రేమలతో అతని హృదయం నిండిపోయింది. ఆభావం అతని కళ్ళల్లో చూడగలిగిన పద్మావతి తనువు, మనసు అపూర్వమైన ఆనందానుభూతితో పులకరించాయి కొంగుతో కళ్ళు వత్తుకుంటూ, "మరింకెవళ్ళి ఆయన్నితీసుకు వద్దామా?'' అంది.

"అలాగేనమ్మా — కాని నాకు ఒక్క సందేహం. అతిభయంకరమైన ఆగతాన్ని ఇంత సులభంగా మరిచిపోయి ఆయన్ని ఎలా క్షమించ కలుగుతున్నావు? మొదట ఆయన స్థితికి జాలిపడినా నీయీ కష్టాలన్నింటికి ఆయనే కారణం. ...... .''

"ఒద్దు బాబూ నువ్వు ఆయనమీద ద్వేషం పెంచుకోకు. జీవితంలో చాలా భాగం గడిచిపోయాక అనుకోకుండా అదృష్ట వశాత్తు ఆయనకి దొరికిన పెన్నిధివి నీవు.



# అర్ధాంగి

ఇన్నాళ్ళూ ఆయున పొందలేకపోయిన అభిమానానికి ఆదరణకి ఏలాంటి లోపం రానివ్వటం. ఇంక క్షమించటం సంగతి అంటావా? ఆయున్ని భగవంతుడే క్షమిం చాడు. అందుకే పశ్చాత్తాపం అనేది కలిగింది. ఇంకనువ్వూ నేనూ అనగా ఎంత—పద, ఆలశ్యం చేయకుండా వెళ్దాం" అనిలేవ బోతూ, "ఇప్పుడు వారిపరిస్థితి...." అంటూ ఎదురుగా కొడుకు కళ్ళ లోకి చూసింది.

"ప్రమాదం ఏమీ లేదమ్మా భయ పడకు." అంటూ తల్లికి ధైర్యం చెప్పాడు అతను.

* * *

ఓ ప్రక్కకి తలవాల్చి, కళ్ళు మూసుకు పడుకున్న సుదర్శనంగారు. అడుగుల చప్పుడు విని కళ్ళు తెరిచి చూశారు. కన్నీటి పొర అడ్డువచ్చిన ఆయున కళ్ళకి ఆవ్యక్తిని గుర్తుపట్టటం చేతకాలేదు ఎవ రీమె అనుకుంటూనే ఆలా రెప్పవాల్చకుండా చూచారు కొద్దిక్షణాలు. ఆయున మనసు చాలా సంవత్సరాలు వెనక్కి పరుగెత్తింది అంతరంగం ఆశామోహిత మయి పోయింది. కాని ఆలోచన అది అసంభవం అని చెప్పింది. అయినా ఆగలేక "ఎవరు?" అన్నారు వణుకుతున్న కంఠంతో

భర్తను చూసిన ఆనందంతో, ఆస్థితిలో కలుసుకోవలసి వచ్చిన బాధతో ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయాయి అంతవరకు పరుగు పరుగున వచ్చిన కాళ్ళు అక్కడే ఆగిపోయాయి. అడుగుముందుకు పడటం లేదు. గొంతుపెగుల్చుకున్నా మాటరావటం లేదు వళ్ళంతా ఏదోమత్తు ఆవరించిన నట్లుంది అయినా ఆయునలోని శక్తి నంతా కూడదీసుకుని పెనుగులాడి కొద్ది క్షణాలలోనే అవిచ్ఛిత్రమయిన అనుభూతి నుండి బయట పడి ఒక్క పరుగున వెళ్ళి భర్త హృదయం మీద వాలిపోయింది. చిరకాల వియోగానంతరం భర్తను కలుసు కోగలిగిన అదృష్టానికి పరవశించిపోతూ పసిపిల్లలా ఆయున గుండెల్లో తల దాచుకుని, ఎన్నెన్నో చెప్పాలని ఏమేమో అడగాలని అనుకుంది. కాని ఉప్పెనలా పొంగివస్తున్న దుఃఖంలో "నేనే, నేనే" అన్న మాట తప్ప మరేమీ సాధ్యం కాలేదు.

ఆయునకి అది కలో నిజమో అర్థం కావటంలేదు. 'అసలు మెదడు పనిచెయ్యటం మానేసిందేమో' ననిపించింది. ఆశా నిరాశలమధ్య కొట్టుకుంటూనే,

"ఎవరు? శాంతా?" అన్నారు.

"అవును." గొణిగింది పద్మావతి.

"శాంతవా? ఇదినిజమా శాంతా? నేను కలగనటం లేదుకదా?" అంటూనే, ఆకలలో నైనా సరే ఆలా ఆమె ఉనికిని శాశ్వతం చేసుకోవాలి అన్నట్లు స్వాధీనంలో వున్న ఒక్క చేత్తోనే ఆమెనింకా దగ్గరికి తీసు కున్నారు.

"శాంతా, శాంతా—" భర్తపిలుపులోని అనురాగం, లోకంలోని ఆప్యాయతనంతా నింపుకున్న ఆరెండక్షరాలలోని మధురనినాదం పతిధ్వని తీసుతూ దిగంతాలని చుట్టి వచ్చి ఆమె శ్రవణేంద్రియాలలో ఆగ కుండా అమృతసోనలు కురిపిస్తూండగా మైమరచి మత్తుగా కళ్ళుమూసుకుని అలాగే వుండిపోయింది.

"చెప్పుశాంతా? నువ్వు నిజంగా బ్రతికే వున్నావా? ఇన్నాళ్ళు ఎక్కడవున్నావు?"

"బ్రతికుండే ఇన్నాళ్ళూ మీకు దూరంగా వుండిపోయాను. నన్ను క్షమించండి— నన్ను క్షమించండి ..."

"నీజీవితనౌకని నడి సముద్రంలో తోసివేసిన ద్రోహిని, నిన్ను మనిషిగా అయినా గుర్తించని కిరాతకుడిని, ఏపాపము ఎరుగని నీమీద భయంకరమైన అపవాదు సృష్టించిన నీచుడిని—నన్ను నీవు క్షమా ర్పణ అడుగుతున్నావా?... ... ఆమాట నేను అనాలి. కాని అలా అడిగే అర్హతకూడ నాకు లేదు"

"అంతమాట అనకండి. జరిగిం దంతా మరచిపోదాం."

"హుం. మరుపు. ఎంత సులభంగా చెప్పావు. నీలాంటి ఉత్తమురాలికి సాధ్యంకాని దంటూ ఏదీవుండదు. అందుకే నేను చేసిన ద్రోహం మరచిపోయి మన్ని క్షమించి, ఈ నాడిలా రాగలిగావు." అన్నాడు ఆదరంగా ఆమె తల నిమురుతూ.

"ఇందులో నా గొప్పతనం ఏమీలేదు. పవిత్రమైన వివాహబంధంతో ముడి పడిన మన జీవితాలని అంత సులభంగా త్రెంచుకోటం సాధ్యంకాదు. మంచికీ చెడుకీ కష్టానికీ సుఖానికీ తోడునీడగా వుండి, చేయి చేయి కలుపుకుని బ్రతుకు బాటలో ప్రయాణం సాగిస్తామని ఆనాడు

ప్రమాణం చేశాం. ఏ దేవతలో శపించటం వల్ల మధ్యలో ఎబాటు చీలి పోయింది ఈనాటికి శాప విముక్తి కలిగి మన అదృష్టంవలన ఆ చీలికలు మళ్ళీ కలుసుకున్నాయి...... అయినా మన ఈ బాంధవ్యం ఈ ఒక్క జన్మదే కాదు. జన్మ జన్మల నించీ వస్తున్న అనుబంధం ఇది. అదే నన్ను పట్టి ఇలా లాక్కు వచ్చింది." అంది కొద్దిగా తల ఎత్తి భర్త కళ్ళల్లోకి చూస్తూ.

"హృదయాన్నిండా యింత అనురాగం నింపుకున్న నీవు నన్ను చూడకుండా ఇన్నాళ్ళు ఎలా వుండ గలిగావు? బహుశ నాలో మార్పు వచ్చిందని తెలిస్తే ఇంకా త్వరగా వచ్చేదానివేమో నువ్వు ఆత్మహత్య చేసుకున్నావని విన్న క్షణంలోనే నాలో పరివర్తన వచ్చింది నాలో కరడు కట్టుకు పోయిన కాఠిన్యం అహంకారం మంచులా కరిగి పోయాయి. చేసినతప్పు తలుచుకుని పశ్చాత్తాపంతో కృంగి పోయాను ఇంకెన్నైనా మానవత్వం గల మనిషిగా బ్రతకాలని నిశ్చయించుకున్నాను కాని నాకు ఎదురైన సమస్యలు వచ్చిన అవకాశాలు నన్ను మరీ పశువుని చేశాయి నేను తిరిగి ఉచ్చరించలేని ఘోరలు ఎన్నో చేశాను నన్ను చూసి నేనే సిగ్గుపడుతూ, ఒక్కోసారి అసహ్యించు కునేటంత నీచంగా దిగజారి పోయాను కాని చిత్రం ఏమిటంటే కష్టంలో, సుఖంలో ఎప్పుడూ నీ స్మృతి నన్ను వెన్నంటుతూనే వుండేది నువ్వు నాదగ్గరే వున్నప్పుడు ఒక్క క్షణం అయినా నిన్ను గురించి ఆలోచించని నేను, అనుక్షణం నీ జ్ఞాపకాలతోనే సతమత మవుతూ వుండేవాడిని ఆ ఆలోచనల నుండీ, జ్ఞాపకాల నుండీ పారిపోవాలని నేను చేసే ప్రయత్నాలన్నీ వృధా అయేవి. నిన్ను సుఖపెట్టలేక పోయినందుకు బాధపడుతున్నా, చచ్చి నన్నిలా సాధిస్తున్నావని చికాకు కలుగుతూండేది ఆ చికాకులో కసిగా నేను చేసిన పాపాలన్నింటికీ శిక్ష అనుభవించేశాననే అనుకుంటున్నాను ఇంకా ఏమైనా మిగిలి పోయినా అనుభవించే శక్తి నాకు లేదు నా తప్పులన్నీ క్షమించమని భగవంతుడిని ప్రార్థిస్తూండేవాడిని. కాని, భగవంతుడు అనుగ్రహిస్తాడా అనే అనుమానం ఇన్నాళ్ళు నన్ను బాధిస్తూంటేది. ఇంక ఆబాధలేదు. దయామయుడైన ఆ భగవంతుడు జీవితంలో నే నెప్పుడూ ఆశించని వరం నాకనుగ్రహించాడు. చివరి రోజులలో నిన్ను చూడ గలిగిన ఆనందంలో, నా పాపాలకి ఎలాంటి శిక్ష అయినా సంతోషంగా అనుభవిస్తాను. నిశ్చింతగా సంతృప్తిగా కళ్ళు మూస్తాను......"

కాంత తటుక్కున చేయి జాపి ఆయన్ని వారిస్తూ, "మీరిలా మాట్లాడితే నేను వినలేను. మీ రింక గతాన్ని తలుచుకుని బాధపడటం మానేయాలి." అంది. ఆయన రెండు కళ్ళనుండి పక్కలకి కాలవలు కడుతున్న కన్నీటిని కొంగుతో తుడుస్తూ.

"లేదు కాంతా నాకిప్పుడా బాధలేదు. నన్ను గురించిన దిగులు అంతకన్నాలేదు— కాని శిథిలమై పోయిన ఈ జీవితం ఇక ఎన్నాళ్ళో వుండదు. తిరిగి నీవు ఒంటరి దానవై......"

ఆయన మాట పూర్తికాకుండానే,

"మీకా బెంగ ఏమీ వద్దు. మీ ఆరోగ్యం మీ రనుకున్నంత పాడై పోలేదు. ఎన్ని మందులైనా వాడి, తన తెలివిని, అనుభవాన్ని ధారపోసి బాబు మిమ్మల్ని బాగు చేస్తాడు వాడి వైద్యంతో, నా సపర్యలతో మీరు త్వరలోనే మళ్ళీ మామూలుగా లేచి తిరుగుతారు" అంది చచ్చుపడిపోయిన ఆయన చేతిని మృదువుగా నిమురుతూ.

ఆయనకి ధైర్యం చెప్పాలని పైకి గంభీరంగా వుండాలనుకున్నా, అంతరంగంలో అవ్యక్తమైన భయంతో బిగుసుకు పోతోంది. ఎంత ప్రయత్నించినా ఆగకుండా అశ్రువులు ప్రవహిస్తూనే వున్నాయి.

కాంత చెప్పున్నది వింటూ ఒక్క క్షణం ఏమీ అర్థం కానివాడిలా తెల్లబోయి, అంతలోనే గ్రహించుకున్నట్లు సంబరపడిపోతూ ఆ సంతోషం మొహం నిండా, కళ్ళనిండా నింపుకుని, "నువ్వు చెప్పున్నది మన బాబు గురించేనా? నేనసలు ఇంత వరకు ఆ సంగతే అడగడం మరిచి పోయాను. చెప్పు మనకి అబ్బాయా? వాడు డాక్టరయాడా, ఎక్కడున్నాడు, నన్ను చూడ్డానికి వస్తాడా, నాగురించి వాడికంతా చెప్పేశావా?" అన్నాడు కాంత భుజం పట్టుకుని కుదిపేస్తూ.

కాంత తడికళ్ళతోనే తృప్తిగా గర్వంగా నవ్వింది. "అవును, మనబాబు డాక్టరయాడు — ఇప్పుడే వస్తాడు" అంటూ ఇవతలకి జరిగి సర్దుకు కూర్చుని "హరి" అని పిలిచింది.

తల్లి దండ్రుల సంభాషణలో చాలా భాగం విన్న హరీష్ గబగబ కర్చీఫ్‌తో కళ్ళు తుడిచేసుకుని, తనని కొడుకుగా గుర్తించిన తరువాత ఆయన ఎలాంటి అనుభూతికి లోనవుతారో వూహించుకుంటూ, ఆయన ఫలానా అని తెలిసిన తరువాత



మొట్టమొదటి సారిగా తండ్రిని కలుసుకోబోతున్న సంతోషం ఆనందం పరవళ్ళు తొక్కుతూంటగా ఆత్రుతగా అడుగులు వేసుకుంటూ గదిలోకి నడిచాడు.

గుమ్మం దగ్గర హరీష్‌ని చూస్తూనే సుదర్శనంగారు "డాక్టర్‌బాబూ" అని ఏదో చెప్పబోతూంటే,

"రా హరీ" అంది శాంత.

"ఆ .." ఒక్క క్షణం నిర్ఘాంతపోయి, అంతలోనే తేరుకుని ఆ సంతోషాన్ని ఉత్సాహాన్ని అలా పడుకుని భరించడం సాధ్యం కాదన్నట్లు, ఒక్క ఉదుటున లేచి కూర్చోబోయారు. అది తనకు సాధ్యం కాదన్న సంగతికూడా మరిచిపోయి,

"మీరు హైరాన పడకండి" అంటూ హరీష్ చటుక్కున వచ్చి తండ్రి చేయి పట్టుకుని, తల్లి సహాయంతో ఆయనని లేవదీసి సరిగ్గా కూర్చోబెట్టాడు దిండు సహాయంతో గోడ నానుకుని కూర్చున్న సుదర్శనంగారు, తనకి చెరోవైపునా కూర్చున్న భార్యాపుత్రులను చూసుకుంటూ ఎన్నో మాటలు చెప్పాలనుకుని కూడా, సంతోషంతో గొంతునిండి పోగా, అనేకమైన భావాలని కళ్ళల్లోనే నింపుకుని మౌనంగా కొడుకుని దగ్గరికి తీసుకుని తల నిమురుతూ వుండి పోయారు కొన్ని క్షణాలు. దైవికంగా ఏర్పడిన ఆసమాగమంలోని ఆ కొద్ది క్షణాలు అతి పవిత్రమైనవి, అమూల్యమైనవి, ఎప్పటికీ అప్పటికే సిగ్గుతో నుగ్గు, నుగ్గు అయి

# అర్ధాంగి

మరిచి పోలేనివి. జీవితంలో ఎప్పుడు గుర్తుకు తెచ్చుకున్నా, శరీరంలోని ప్రతి అణువు అపూర్వమైన ఆనందానుభూతితో పులకించిపోయే మధుర క్షణాలు అవి.

జీవితంలో మొట్ట మొదటి సారిగా పితృ వాత్సల్యంలోని మధురిమని చవి చూస్తూ, పాతికేళ్ళ యువకుడూ పసివాడిలా ఆయన కౌగిలిలో ఒదిగిపోయాడు హరీష్. ఆదృశ్యాన్ని చూసిన పద్మావతి, ఎన్నాళ్ళనుండో పేరుకు పోయిన హృదయ భారం తీరిపోయినట్లు హాయిగా, తృప్తిగా ఆనంద భాష్పాలు ఒత్తుకుంది

"ఎంతటి పాపాత్ముడినైనా భగవంతుడు క్షమిస్తాడు— అనే సత్యాన్ని నేనీ రోజే తెలుసుకున్నాను. లేకపోతే నాలాటి దుర్మార్గుడికి ఇంత అదృష్టం పట్టదు." అన్నారు సుదర్శనం గారు తనని ఆవరించుకుని అవాక్కుని చేసిన రాగమయ జగత్తు నుంచి క్రిందికిదిగి ఈ లోకం లోకి వస్తూ.

"నీచుడ్ని, దుర్మార్గుడిని అంటూ మిమ్మల్ని మీరే అలా కించపరుచుకోకండి— తప్పులు చేయడం మానవ లక్షణం." పోయి ఆయన హృదయానికి కాస్తవున్న ఓదార్పు కలిగించే వుద్దేశ్యంతో తండ్రి కళ్ళల్లోకి జాలిగా చూస్తూ, అనునయంగా అన్నాడు హరీష్.

ఆదరంగా అతని చెంపలు నిమురుతూ, "తెల్లవారింది కూడా నాతోనే వుండిపోవు" అన్నారు ప్రక్కకి తిరిగి భార్యతో.

"ఇంక యింటికి వెళ్దామా." అంటూ లేచాడు హరీష్.

"ఇంటికా— అదేమి కదూ— అలాగే వస్తాము". అని, "అసలు ఇన్నిరోజులు నువ్వు ఎక్కడ వున్నావు, బాబుని ఎలా పెంచి పెద్ద చేశావు, చదువు చెప్పించావు— ఆ సంగతులన్నీ చెప్పనేలేదు" అన్నారు శాంతతో.

"అదంతా మరోసారి చెప్తాను. ఇప్పటికే చాల ఆలశ్యం అయిపోయింది. రా హరీ, మనిద్దరం కలిసి నాన్నగారిని మెల్లిగా కారులో పడుకోబెడదాం."

"నువ్వుండమ్మా. అవసరం వస్తుందని డ్రైవర్ని కూడ తీసుకు వచ్చాను. మేమిద్దరం తీసుకు వెళ్తాం." అని హరీష్ బైటకి వెళ్ళిపోయాడు.

జరుగు తున్నదంతా ఇంకా కలా, నిజమా అన్నట్లు ఆశ్చర్యంగా తనవంకే చూస్తున్న భర్తతో, "ఏమిటలా చూస్తున్నారు. . కారులో ఎక్కించినప్పుడు, అక్కడ దింపేటప్పుడు మీకు కొంచెం ఇబ్బందిగా వుంటుందేమో ఇంక వోసారి యింటికి వెళ్ళాక మీ కెలాంటి కష్టమూ వుండదు." అంటూ చెదిరి పోయిన ఆయన క్రాపుని చేత్తో వోసారి సరిజేసి, పల్చటి దుప్పటి ఒకటి ఆయన భుజాలచుట్టూ కప్పింది.



# మిల్లర్ సైకిల్ డైనమో లైటింగ్ సెట్టులు

## రాత్రిపూట సురక్షితంగా సైకిల్ త్రొక్కడాన్ని సాధ్యం చేసినవి

మిల్లర్ సైకిల్ డైనమో లైటింగ్ సెట్టులు ముందు 30 గజాల దూరం వరకు వెలుతురు ప్రసారింపజేస్తూ వుండగలవు. సమర్థవంతంగా, నమ్మకంగా పనిజేయడానికి మిల్లర్ సైకిల్ డైనమో లైటింగ్ సెట్టులనే కోరండి.

ప్రత్యేకతలు:

● తక్కువ వేగముతో నడిచేటప్పుడు కూడా వెలుతురు తగ్గకుండా వుండడానికి ఎనిమిది పోల్ మాగ్నెట్ రోటార్ ● డైనమో ఒకేరకంగా స్థిరంగా పనిచేసేఏర్పాటు; వేగంగా పోయినా బల్బు మాడిపోదు ● వెలుతురు బాగావుండడానికి పనరుగా వాక్యూమ్ మెటలైజ్డ్ రిఫ్లెక్టర్ ● వాతావరణం ఎగుడు దిగుడులను తట్టుకోగల ఏర్పాటు ● పగలకుండాను. గీరలుపడకుండా నుండగల "డైయాకోన్" ఫ్రంట్ లెన్సు.

మిల్లర్ ల్యాంప్ వుంటే మీరు సర్వదా సరియైన దారిలోనే వుంటారు

95 సంవత్సరాలకు పైగా పేరు ప్రఖ్యాతులు గాంచిన హెచ్ మిల్లర్ & కంపెనీ లిమిటెడ్ బర్మింగ్‌హామ్, యునైటెడ్ కింగ్‌డమ్‌వారి సహకారంతో ఉత్పత్తి చేస్తున్నవారు.




**టిఐ మిల్లర్ లిమిటెడ్ మద్రాసు-1**

వర్క్సు: అంబత్తూరు, మద్రాసు-53

హెచ్. మిల్లర్ & కం., లి, యు.కె. వారి రిజిస్టర్డు ట్రేడ్ మార్కు. ఇండియాలో ఉత్పత్తిదారులు: మిల్లర్ లి. మద్రాసు-1 రిజిస్టర్డ్ వాడకందార్లు.

TI వారి సంస్థలలో ఒకటి.

FDS-TIM-683TR A

# అర్ధాంగి

"ఫరవా లేదు. ఎంతటి బాధనయినా భరించగలను. నేను యింతకు ముందు అనుభవించిన వాటితో పోల్చి చూస్తే...." మధ్యలోనే ఆపేసి కళ్లు ఒత్తుకున్నారు.

*   *   *

దేవేంద్ర భవనంలాంటి మేడముందు కారు ఆగగానే తెల్లబోయారు సుదర్శనం గారు. అంతలోనే అదేదో నర్సింగ్‌హోమ్ ఏమో అనే వూహ వచ్చింది. కాని, నౌకర్ల సహాయంతో హరీష్ ఆయన్ని లోపలి గదిలోకి తీసుకువెళ్లి మంచం మీద పడుకో బెట్టగానే ఆ గదిలోని అలంకరణ, చుట్టూవున్న సామాను అవీ చూసి అది నర్సింగ్‌హోమ్ కాదనీ తన భార్యా కొడుకూ వుంటున్న ఇల్లనీ గ్రహించుకున్నారు.

"ఒంటరిగావున్న ఆడది పిల్లవాడిని పెంచి పెద్ద చేయడమే కష్టం. అందునా డాక్టర్ చదువు చెప్పించటం ఇంకాకష్టం. అదేకాకుండా, అడుగడుగునా ప్రదర్శిత మవుతున్న ఇంతటి ఐశ్వర్యం భోగ భాగ్యాలు వీళ్లెలా అనుభవించ కలుగుతున్నారు. హరీష్ సంపాదనతోనే ఇవన్నీ వచ్చాయా? కూతురు బ్రతికేవుందని తెలుసుకున్న మామగారు ఏమైనా సహాయం చేశారా?" తలా తోకా లేని ఆలోచనలతో ఆయన కనుబొమలు కొద్దిగా ముడుచుకున్నాయి. మంచంలో పడుకునే కాస్త ఇబ్బందిగా తల యిటూ అటూ తిప్పి చూశారు. ఎంత దాచుకోవాలనుకున్నా ఆయన కళ్లు ఆశ్చర్యాన్ని నింపుకుని దేనికోసమో వెతుకుతున్నట్లు నాలుగు వేపులా చూస్తున్నాయి. ఆయన మనస్సులో మాట గ్రహించినట్లు పద్మావతి చిన్నగా నవ్వుతూ,

"నేనిన్నాళ్లు ఎలా బ్రతికానో తెలుసుకోవాలని మీకు చాలా తొందరగా వుంది కదూ, ముందు స్నానం భోజనం అయిపోతే తరువాత సావకాశంగా అన్ని సంగతులు చెప్తాను. ఇప్పటికే మీ భోజనానికి ఆలశ్యం అయి పోయింది." అంది.

"అబ్బే — అలాగే—" అంటూ తడబడుతూ సర్దేశారాయన.

అందరి భోజనాలు అయిపోయిం తరువాత వంటగది సర్దేసి, కాస్త వక్కపొడి నోట్లో వేసుకుని వచ్చింది పద్మావతి, తో కుర్చీ మంచం దగ్గరగా జరిపి కూర్చోబోతుంటే, చెయి జాపి ఆమెను అందుకుని తన మంచం మీదే కూర్చో బెట్టుకున్నారు సుదర్శనం గారు.

గతాన్ని గుర్తు చేసుకుంటూ దూరంగా ఎటో చూస్తూ మౌనంగా కూర్చుంది పద్మావతి.

ఆమె దృష్టి తన వేపుకి తిప్పుకోవాలనే ఉద్దేశ్యంతో, "ఏదో చెప్తానన్నావ్" అన్నారాయన.

తల యిటు తిప్పి, "అదే ఎలా మొదలుపెట్టాలా అని ఆలోచిస్తున్నాను" అంది. ఆమెకంఠం భారంగా వుంది.

"కుతూహలం అణుచుకోలేక నిన్ను తొందర పెడుతున్నాను."

"అబ్బెబ్బే. అదేం లేదు."

ప్రక్కగదిలో పడుకుని పుస్తకం తిరగేస్తున్న హరీష్ ఆ సంభాషణ విని, పుస్తకం ప్రక్కన పడేసి, ఓ ప్రక్కకి ఒత్తిగిలి కొద్దిగా లేచి అరచేతిలో తల అమర్చుకుని ఆసక్తిగా వినసాగాడు.....

*   *   *

తండ్రి రాకకోసం ఎదురు చూస్తూ ఆత్రంగా ఇంట్లోంచి వాకిట్లోకి, వాకిట్లోంచి ఇంట్లోకి తిరుగుతోంది శాంత. కూతురు ఖంగారు చూసి జాలిగా బాధగా నవ్వుకుంది మాణిక్యాంబ. కొంచెం సేపటి తరువాత, ఇంక వూరుకోలేక, "ఇవాళే రావడానికి వీలవుతుందో లేదో!" తనలో తను అనుకుంటున్నట్లు పైకే అనేసింది.

తల్లి తన ఆదుర్దా కనిపెట్టేసిందని సిగ్గుపడిపోయి కాస్సేపు కదల కుండా గదిలోనే కూర్చుంది శాంత ఇంతలో గణగణ గంటలు చప్పుడు చేసుకుంటూ వస్తున్న రెండెడ్లబండి తమ యింటి వేపే రావటంతో ఒక్క వరుగున వీధిలోకి వచ్చింది. ఆ బండి తమ యింటి ముందు ఆగింది. అందులోంచి దిగబోతున్న తండ్రి మొహం కనిపించింది. ఆయన ఇటు చూడటంలేదు. శూన్యం తప్ప మరో భావం లేని కళ్లతో పరధ్యానంగా ఎటో చూస్తూ బండి దిగుతున్నారు. ఒక్క త్రుటికాలం తండ్రి మొహంవేపు చూసిన శాంత గుండెలు భయంతో బిగుసుకుపోయాయి. అక్కడ నిలబడలేక గదిలోకి వెళ్లి తలుపులు దగ్గరగా వేసేసుకుంది—

(సశేషం)

BENSONS/NGB-1017 Tel

# ఆమె వివాహ సమయంలో మా ఆనందానికి అంతులేదు...

"మేము నిజంగా పరమానందభరితులమయ్యాము. మాకు వచ్చే ఆ స్వల్ప ఆదాయంతో పిల్ల వివాహాన్ని ఇంత ఘనంగా మేము జరపగలమని ఎన్నడూ కలయినా కనలేదు. నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్‌లో కొద్దికొద్ది మొత్తాలు దాచుకోవచ్చునని మాకు ఎవరు సలహా ఇచ్చారో కూడా మేము మరిచిపోయాము. కారణం వారు సలహా ఇచ్చి చాలాకాలం కావడమే. అంతంత చిన్న మొత్తాలను ఆ బ్యాంకు తీసుకుంటుందా అని మేము ఆశ్చర్యపడ్డాముకూడా. మీరుకూడా అలాగే ఆశ్చర్యపడతారు. "అయిదే అయిదు



రూపాయలతో మీరు ఖాతా ప్రారంభించినా మేము సంతోషిస్తాము" అని వారు మాకు చెప్పారు. నిజంగా సేవింగ్స్ బ్యాంక్ అక్కౌంట్ ప్రారంభించడానికి అయిదు రూపాయలే చాలు. అంతేగాదు. సాలీనా నూటికి 4 రూపాయల వడ్డీతో మీరు దాచుకున్న డబ్బును వారు పెంచుతారు. మనకు ఎప్పుడు కావాలంటే అప్పుడు వెళ్లితే చాలు స్నేహపూర్వకమైన సలహాలు ఇస్తారు. మంచి బ్యాంకుకు వుండవలసిన లక్షణాలన్నీ అవే ఆ బ్యాంకుకు వున్నాయి. నేషనల్ గ్రిండ్లేస్ బ్యాంక్‌కు వెళ్లి మీరే స్వయంగా తెలుసుకోండి."

*మీరూ, నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంకు మంచి స్నేహితులవుతారు*

## నేషనల్ అండ్ గ్రిండ్లేస్ బ్యాంక్ లిమిటెడ్

యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఇన్‌కార్పొరేట్ చేయబడినది ● సభ్యుల బాధ్యత పరిమితం
అసోసియేటెడ్ బ్యాంక్స్ ● లాయడ్స్ బ్యాంక్ లిమిటెడ్ నేషనల్ ప్రావిన్షియల్ బ్యాంక్ లిమిటెడ్

బ్రాంచీలు: మద్రాసు: 8, నార్త్ బీచ్ రోడ్; 378, నేతాజీ సుభాష్ చంద్రబోస్ రోడ్డు (లాయిడ్స్ బ్రాంచి); 8, ఆర్మీనియన్ స్ట్రీట్; 158, మౌంట్ రోడ్డు. హైదరాబాదు: ఆబిడ్ రోడ్.




"శాంతాదేవీ!!!"

జనసమూహపు సందడిలో నుంచి కేక విన్న శాంతాదేవి హఠాత్తుగా ఆగిపోయింది. గతకాలంలో నిపూర్వాధ్యాయంలో పరిచయమున్న కంఠస్వరం అది. ఆ కంఠస్వరం ఆమె నవనాడులలోను భయం, వుత్సాహం నింపివేసింది. చేతిలో సూట్‌కేస్ జారిపోయిందన్న విషయం కూడ మరచిపోయి కేక వచ్చిన వైపు చకచక అడుగులు వేసింది. వేస్తున్న అడుగులు వేగాన్ని తగ్గించుకొని కొంచం సేపటికి ఆగిపోయాయి. ఆగిపోయినచోటులో ఆరడుగుల వ్యక్తి నిల్చుని వున్నాడు. ముఖం ఎర్రరంగు పులుముకొని వింత ఆకర్షణ తెచ్చుకొంటూ వుంది. బలిష్టమైన శరీరం ఆ ఆకర్షణకు చేయూత యిస్తూ వుంది. ఆ వ్యక్తి వయస్సు ఓ యాభై సంవత్సరాలు వుండి వుండవచ్చు..

ఆ వ్యక్తిని నఖశిఖపర్యంతం తనివి తీరా మరోసారి చూసింది శాంతాదేవి. ఆమె చూస్తున్న ప్రతి చూపులోను అర్థంలేని ఆవేదన, ఆకృతిలేని ఆవేగం కలసి పొంగుతున్నాయి. ఆమె కన్నులలో నీళ్లు గిర్రున తిరిగాయి. తన కన్నీళ్లు ఎదుటగా నిలబడిన వ్యక్తికి అగుపడకుండా తలవంచుకొంది. అయినా కన్నీటి బిందువులు జలజల క్రింద రాలాయి.

"ఏడుస్తున్నావా శాంతా?'

ఆ వ్యక్తి ప్రశ్న విని కాదన్నట్లు తల ఆడించింది. మాట్లాడాలని గొంతు విప్పింది గాని అతి సంతోషము, అతి విషాదము పొంగుతున్న హృదయంలో నుంచి వచ్చిన తెర కంఠస్వరాన్ని కప్పివేసింది.

"శాంతా! నీ కోసం అయిదు సంవత్సరాల నుంచి అన్వేషిస్తున్నాను. నేను కోరుకున్న జీవితానికి వెలుగు, అర్థం అయిదు సంవత్సరాల క్రితమే తెలిసింది, అప్పటినుంచి అన్వేషించుతూ వుంటె యిప్పుడు కన్పించావు. యిప్పుడే కాదు, మరో పది సంవత్సరాల తర్వాత అయినా యింతే సంతోషం పొంది వుండేవాడిని."

బరువుగా జీరను దొర్లించుకుపోతున్న ఆ కంఠస్వరం విని శాంతాదేవి గంభీరం వహించింది. ఆయన ముఖంలోకి మరోసారి చూసింది. ప్రస్ఫుటంగా వెలుగుతున్న కన్నులలో వాత్సల్యము, ప్రేమ చల్లగా సాగుతున్నాయి. ఆ చల్లదనం అనుభవంలోకి తెచ్చుకొని ఆమె అధీరురాలయింది.

"మధుబాబూ" ఆమె పిలుపు కొంచం తొట్రుపడింది. పైగా పలుకుతున్న పెదవులు ఆంతర్యంగాను, బాహ్యంగాను కూడ ఏదో వెతికాయి. ఆ వెతకటంలో కొంత భయం కల్గిందికాని వెంటనే అణచివేసింది.

"ఏమిటి శాంతా నీ పెదవులు అదురుతున్నాయి? నీ కన్నులు ఎందుకో వుబుకుతున్నాయి. నాకు దుఃఖం కల్గినపుడు కుడి చెంప అదిరేది. యిప్పుడూ అలాగే వుంది. నీకు అగుపడి తప్పు చేశానా శాంతా? చెప్పు శాంతా నీకేకాదు, యీ కాలానికి కూడ కనబడకుండా వెళ్లిపోతాను." ఆ మాటలలో అభ్యర్థన, ఆవేదన నిశ్చలత శాంతాదేవిని మరింత అధీరురాల్ని చేశాయి

"నేను బాధపడటంలేదు మధూ. తన ఆంతర్యం ఎటువంటిదో తెలుసుకోలేదు స్త్రీ. అయినప్పుడు నేను ఏమి చెప్పను? నీతో మాట్లాడాలి. అలా కృష్ణ ఒడ్డుకు పోదాంపద"

ఆయన శాంతాదేవి వంక చూచి తలూపాడు. క్రిందపడిన సూట్‌కేసును అందుకొని శాంతాదేవి చేతిని తీసుకొని రోడ్డు మీదకు వచ్చాడు. ఎదురుగా వచ్చిన టాక్సీని పిలిచి అందులో కూర్చున్నారు. టాక్సీ నున్నని రోడ్డు మీద దూసుకుపోతోంది. శాంతాదేవి ఎక్కడో ఆలోచిస్తూ వుంది బయటకు చూస్తూ. మధుబాబు శాంతాదేవి ముఖం వంక పరిశీలనగా చూసాడు.

తను జీవితంలో సగభాగం దాటి వచ్చేశాడు అని తెలుసు. కారులానే కాలం కూడ దూసుకుపోతూ వుంటే తను దాహంతో వెంట పరుగెత్తాడు. దాహంతో సాగిన జీవితంలో యింతవరకు దొర్లిన క్షణాలు తనకు వుపయోగపడ్డాయా? లేక తనను వుపయోగించుకున్నాయా? ఆయన మరల శాంతాదేవి వంక చూశాడు. ఆమెకు నలభై ఐదేళ్లు వుండి వుండవచ్చు. ఆమె ముఖం మీద చిన్నచిన్న ముడుతలు అగుపడుతున్నాయి, చెంపలు తెల్లగా పాలిపోయాయి,

తల మీద వెంట్రుకలు అక్కడక్కడ తెల్లగా నెరసినట్లున్నాయి. కాని ఆయనకు ఆమె కళ్లల్లో పాతికేళ్లనాటి కాంతి, వెలుగు అగుపడుతున్నాయి. పాతికేళ్లు దాటిపోయినప్పటికి ఆమె పాతికేళ్ల శాంతాదేవి గానే అగుపడుతోంది ఆయనకు.

మరోసారి ఆమె వంక చూచి పిలిచాడు "శాంతాదేవీ" ఆ పిలుపు ఆమెకు వినబడలేదు. ఆలోచన మిగిలిన ప్రపంచాన్ని మరపింప చేస్తుంది. అందుకు అంతరాయం కల్గించదలచుకోలేదు ఆయన.

దూసుకుపోయినకారు కృష్ణకు దూరంగా ఆగింది. కారు దిగి యిద్దరూ ఒడ్డు వరకు నడుస్తూ వెళ్లి కూర్చున్నారు. మధుబాబుకు ఎదురుగా కూర్చున్న శాంతాదేవి మోకాళ్ల మీద తల ఆనించి వేలి వ్రేళ్లతో అప్రయత్నంగా యిసుకలో పిచ్చిగీతలు గీస్తోంది. తన చేతులు ఏమి చేస్తున్నాయో ఆమెకు తెలియదు. మెదడులో ఒకేవక ఆలోచన 'ఝం' మని మోతతో గంతులు వేయసాగింది.

సంధ్యా కన్నియ పైట కప్పుకొంటోంది చిరునవ్వుతో. పశ్చిమాద్రిన దాగుకొంటున్న సూర్యుడు ముదురు గులాబి రంగును తన ముందు భాగమంతా వెదజల్లి తొంగి తొంగి చూస్తున్నాడు నీలి ఆకాశం మీద అక్కడక్కడ పరుచుకున్న మబ్బుతునకలు చిత్రకారుడు గీసిన తెల్లనిరేఖలులా వున్నాయి ముందు గంతులు వేస్తున్న కృష్ణ తరంగాలు, చుట్టూ పరుగులు తెస్తున్న పిల్లగాలులు, భావాలు తొందర పెడ్తున్న మనసు

"శాంతాదేవి!!" ఆ పిలుపులో ఎన్నో మధురస వాహినీలు, ఎన్నో వాత్సల్య స్రవంతులు దొర్లిపోయాయి. ఆ పిలుపుకు మరోసారి అధీరురాలయింది శాంతాదేవి

"ఊఁ" అని పలికింది.

"ఏమిటి ఆలోచిస్తున్నావు? నన్నుగురించేనా?"

"కాదు, నన్ను గురించే జీవితపు చివరి మజిలీలో ఎదురుపడ్డ అతిథికి యివ్వటానికి యీ పూజారిణి దగ్గర ఏమి వుందా అని ఆలోచిస్తున్నాను"

"నీ నుంచి ప్రతిఫలాన్ని కోరే అతిథిగా కాకుండా ఆత్మీయతను అందించమనే యాచకుడిగానే వుండగలను."

"మధుబాబూ!!"

"అవును శాంతాదేవీ! ప్రతిఫలాశలో స్వార్థం వుంది. స్వార్థంతో దుఃఖం వుంది. ఆ దుఃఖాన్ని నీ యెదుట దౌర్భాగ్యానికి?"

"నన్ను అధీరురాల్ని చేస్తున్నావు మధుబాబూ"

"కాదు, జీవితంలో పొందివ్వ పొందాలనుకున్న వెలుగును నీ ముందు వుంచటానికి ప్రయత్నిస్తున్నాను."

కొంచెంసేపు అక్కడ నిశ్శబ్దం వ్యాపించింది. కనీసం అలల నాదంగాని, పిల్లగాలులు సవ్వడిగాని లేదు. వాళ్లిద్దరూ ఒకరి వంక ఒకరు చూసుకొంటున్నారు. నాలుగుకళ్లలో తిరుగుతున్న గాథలను, భావాలను కాలం గాలంవేసి వెనక్కి లాగాలని ప్రయత్నం చేస్తూ వుంది. అయితే ఓడిపోయిన కాలం ఆ నాలుగు కళ్ల మధ్య నిలువలేక కాబోలు ఎక్కడికోపోయింది. కొంచం సేపటికి శాంతాదేవి నెమ్మదిగా అడిగింది "యిప్పుడు. యీ చివరి అధ్యాయంలో ఎందుకు వచ్చావు మధుబాబూ?"

"కాలం నీ ముందుకు తరిమింది. ఆరాధన పరుగెత్తించింది."

"కాని యిప్పుడు నాదగ్గర ఏమీ మిగలలేదు కాలం వెంట లాక్కుపోయి నలభై ఐదేళ్లు తెచ్చిపెట్టింది ప్రకతి వయస్సును కరిగించింది సంఘం చాల బాధ్యతలను నెత్తిమీద వేసింది. వీటన్నిటిని తప్పుకొని నీకు స్వాగతం యిచ్చే పరిస్థితిలో లేను నేను. యిప్పుడు నాదగ్గర నుంచి ఏమి పొందాలనుకున్నావు? సూటిగానే జవాబు కావాలి"

ఆయన ఎర్రనిముఖం గంభీరం వహించింది ఆయన ఆ పెదవుల మీద చిరునవ్వు యింకా వెలుగుతూనే వుంది ముఖంలో రెండుభావాల రంగులు పులుముకున్న తర్వాత అన్నాడు మధుబాబు "శాంతాదేవీ వీటనన్నిటిని మించి నీకు హృదయం వుంది పాతిక సంవత్సరాల నుంచి ఒక జ్యోతి, నీ హృదయంలో వెలుగుతూ వుంటుందనే నా నమ్మకం ఆరాధన ఆ జ్యోతికి ఆహారం అందించుతుంది యీ నిరంతర అన్వేషణలో నుంచి తప్పుకొని ఆ వెలుగు చల్లదనాన్ని అనుభవించుదామనే వచ్చాను"

"నేను వయుస్సు మళ్లినదాన్ని సంఘం చేసిన వివాహపు మజిలీలో చేరి అన్నీ పోగొట్టుకొని, దాని ఛాయలు మాత్రం వెంట వేసుకొని నడిచేదాన్ని. ఆ ఛాయలు నిన్ను యింకా ఆరాధించటానికి అవకాశం యివ్వవు మధూ! నేను స్త్రీనన్న విషయం నువ్వు మరచిపోకూడదు."

నా మధుబాబు నవనాడులు క్రుంగదీసాయి ఆమెమాటలు. ఉవ్వెత్తుగా లేచిన తరంగం ఒకటి తిరిగి క్రిందపడింది. వివాహం .దానిమీద కపి ఏర్పడింది ఆయనకు కాని తను? తనకున్న అధికారం? యీ సంఘం యివ్వలేదు. ఆ భవనం ఆహ్వానించలేదు.

"క్షమించు శాంతా! ప్రకృతి నియమాలు, సంఘం చేసిన చట్టాలు మనిద్దరి మధ్య అడ్డుగోడకడ్తాయని అనుకోలేదు. యింతవరకు సాగిన జీవితంలో ఆలోచించనిది అదేకూడ. నీకు నలభై అయిదేళ్లు. నాకు యాభై ఏళ్లు. మనిద్దరి మధ్య ఆరాధన వుందని అంటే నవ్వన్నట్లు ఎవ్వరూ హర్షింతరు. ఏ నియమము అక్షింతలు వేయదు. యీ విషయం నాకు తెలును కాని, అంతకుమించి..." ఆపైన ఆయనకు మాటలు రాలేదు గొంతు జీరవేసుకొని పూడిపోయింది. "ఏమీలేదు. ఏమీలేదు. అంతే..." అన్నాడాయన చివరకు ముఖం గంభీరంగా రంగు పులుముకుంది. కనులు కొంచెంగా ఎర్రబడ్డాయి. కనురెప్పలు, మాటమాటకి అదురుతున్నాయి ఆయన వంక అలాగే చూస్తూ వుండిపోయింది, శాంతాదేవి.

కొంచం సేపటికి శాంతాదేవి అడిగింది. "నా నుంచి నువ్వు కోరుకొనేది అర్థం కావటంలేదు"

"నీకు ఎప్పుడో అర్థమయింది సంఘం వెనుక, ప్రకృతి ముందు చేతులు కట్టి నిలబెట్టిన అనుభవం నిన్ను అలా అడిగిస్తుంది నేను నీ నుండి కోరేది ఒకే ఒక వెలుగు పాతిక సంవత్సరాలునాటి ఒకే ఒక్క క్షణం ఆ వెలుగు ఆ క్షణం నువ్వు యివ్వగల్గితే తృప్తిగా చావగలను. యివ్వకపోయినా చావగలను, ఎందుకంటే చావు కోరికలు తీరినా తీరకపోయినా ఆహ్వానించేదే"

"మధూ! నువ్వడిగిన క్షణాన్ని గురించి నేను ఆలోచించుకోవాలి"

"తప్పకుండా ఆలోచించు. ఆలోచన అభిప్రాయానికి నిశ్చలతను కొనియిస్తుంది"

శాంతాదేవి కృష్ణనది వంక శూన్య దృష్టులతో చూడసాగింది. ఆమె ముందు చాలా ఆలోచనలు పరుగెడుతున్నాయి.. సంఘం ప్రకృతి— కాలం— నియమాలు —కర్తవ్యాలు—వయస్సు—హృదయం-ఆరాధన—ప్రేమ .అన్నీ పొంగుతున్నాయి అన్నీ, పూర్ణబిందువుల మాదిరిగా ఒకదాని వెంట ఒకటి వున్నాయి. కాని, ఆ బిందువులో

[illegible]
తెలియుటంలేదు. ప్రతిబిందువు వద్ద ఎంతో కొంత శాంతి వున్నట్లుగా వుంది. ఆశాంతి స్థలానికి తడబడుతూ అడుగులు వేసు కొంటూ వెళ్లి మరల వెనక్కితిరిగి చూస్తుంది. అది స్త్రీకి అలవాటు కూడ కావచ్చు.

ఆరాధన దీనికి ఆది ఎక్కడో, అంతం ఎక్కడో అర్థం కాలేదు. ఆ ప్రవంతిలోని చల్లటి జలాన్ని చవిచూచినపుడు కలిగే సుఖం బహుశా జీవితంలో మరెక్కడా దొరకదేమో

నలభై అయిదేళ్లు పొందిన స్త్రీ మాతృత్వానుభవంలో రెండు బిందువులను మిగుల్చుకున్న స్త్రీ ఆరాధన తెరచాటున విశ్రాంతి తీసుకోటం పాపమా? మోహమా? యీ రెండు పదాలకు అర్థంలేదు అయినా యీ లోకం వ్రేలెత్తి చూపుతుంది.

తను వివాహిత. విధవ. తన సంస్కార జీవితంలో తన భర్తను ప్రేమించిందా? బహుశా లేకపోవచ్చు. కాని కర్తవ్యం నిర్వహించింది కర్తవ్యం వేరు, ప్రేమ వేరు ఆరాధనవేరు వీటన్నిటికి ఒకేరకమైన నియమాలు, ఒకేరకమైన మజిలీలు వుంచాలనుకోవటం పిచ్చి, తెలివితక్కువ

ఆలోచించుతూ ఎదురుగా చూచింది శాంతాదేవి. మధుబాబు ఆమె వంకే చూస్తున్నాడు గంభీరమైన చిరునవ్వు ముఖం మీద నిలుపుకొని. ఆయన అలా చూస్తూ వుంటే ఆమె తెల్లగా పాలిపోయిన చెంపల మీద సిగ్గు దొంతర్లు అప్రయత్నంగానే దొర్లి ఎర్రరంగును పులిమాయి. తెల్లని చెంపల మీద ఎర్రరంగు కలుపుకొనే సృక్కుల్ని చూచి ఆ చల్లదనాన్ని అనుభవించాడు మధుబాబు.

శాంతాదేవి ఏమిటి ఆలోచిస్తున్నావు?" అడిగాడాయన.

"ఆరాధనను గురించి"

'జీవితానికి వెలుగు కాలానికి అందం, మనసుకు మెరుగు యివ్వగల్గింది అదే ఆరాధన నన్ను యింతకాలం బ్రతికించింది.. లేకపోతే అయిదు సంవత్సరాల క్రితమే చచ్చిపోయేదాన్ని."

"ఆరాధనకు పునర్జన్మ వుందంటావా?" ఆ ప్రశ్న అబద్ధమని ఆమెకు తెలుసు. అయినా అడగటంలో కుతూహలం చూపించింది

"అసలు ఆరాధనకు మరణం లేదు

# యుగధార

శాంతా! సమాంతరంగా సాగుతున్న కాలం, వలయంగా తిరుగుతున్న జీవితం, విశాలంగా పరుచుకున్న ప్రపంచం అన్నీ యీ ఆరాధన యిరుసు మీద తిరగవలసిందే.'"

సంజె చీకట్లు ముసురుకొంటున్నాయి. కృష్ణా అలలు చల్లగాలికి కన్నె నడుములా కదులుతున్నాయి నిశా కన్నియ నవ్వటానికి యత్నిస్తోంది.

"ఒక్కసారి యింటికి రాకూడదూ?" ఆయన కళ్లల్లోకి చూస్తూ అంది శాంతాదేవి ఆ మాటకు ఆయన వులిక్కిపడ్డాడు.

"రాగలను కాని ఆ సన్నివేశం నీ జీవితాన్ని పెకలించి వేస్తుంది."

"కావాలని బలహీనురాలిని చేస్తున్నావా?" "కాదు"

కొంచెంసేపు శాంతాదేవి ఏమీ మాట్లాడలేదు. కొన్నిక్షణాలు దొర్లిన తర్వాత అడిగింది.

"యిప్పుడు నువ్వెక్కడ వుండటం?"

"హోటలులో" హోటలు పేరు చెప్పాడు ఆయన ఆ పేరును రెండుమూడు సార్లు మనసులోనే అనుకొంది శాంతాదేవి.

కొంచెంసేపటికి "వెళ్తాను" అని, లేచింది శాంతాదేవి.

"నా అభ్యర్థనకు జవాబు రాలేదు"

"జవాబు కోసం నేను చుట్టుప్రక్కల అన్వేషిస్తున్నాను. దొరికిన జవాబులో నమ్మకం ఏర్పడితే నీ దగ్గరకు పరుగెత్తుకు రాగలను నమ్మకం కల్గకపోతే మిగిలిన కొద్దిపాటి జీవితంలో ఎక్కడా అగుపడను." అని జవాబు కూడ ఆశించకుండా టాక్సీ వైపు వెళ్లిపోయింది. మోకాళ్ల మీద తల ఆన్చి ఆమె వెళ్లిన వంకే చూస్తూ వుండిపోయాడు మధుబాబు.

* * *

కాలం పాతిక సంవత్సరాల వెనుకకు పరుగెత్తి పక్షిలా వాలింది. చల్లని వెన్నెల, అందులో యిమిడిపోయిన తరుచ్ఛాయ. వెన్నెల నీడల పరిష్వంగం మధ్య, చల్లని నునువెచ్చని అనుభూతుల మధ్య యిమిడిపోయి ఆరాధన జ్యోతి వెనుక నిలబడ్డ శాంతాదేవిని చూశాడు మధుబాబు. మధుబాబు వంక చూసింది శాంతాదేవి. రెండు హృదయాలలోను ఏదో భావం పొంగుతున్నాయి. తెలియని భావంతో తీయని అనుభూతి మనసు తెరవేస్తోంది.

స్త్రీ పురుషుడు—ప్రకృతి, కాల[illegible]
మధ్యన ఆరాధన అల్లుకున్న చక్కటి వాతావరణం

రెండు హృదయాలు కలసి అనుభవించిన అనుభూతి కాలం సమీపంతో లేదు. జీవితాలకు అందనిదిలేదు. యిద్దరూ చాలా విషయాలను మరచిపోయారు. ఆమె మెడకు రొమ్ముకు మధ్య నునువెచ్చని ముద్దులతో నవ్వు—నవ్వులో వెలుగు—వెలుగు చాటున దాగిపోయిరి యిద్దరూనూ

ఆమె హృదయపు లోతు, ఆరాధనలోని గతి జీవితానికి ప్రగతిని బోధించాయి.

ప్రగతి వైపు తొంగి చూడగానే పిపాస కల్గింది వెనుకవైపు నిరీక్షించగల ఓర్పు అగుపడోతుంది కాని, ముందు వైపు చూడగానే దాహం కల్గసాగింది. ప్రగతి బిందువుగా నిలబడి ఆహ్వానిస్తోంది

వెంటనే రెండు ధారలు సమాంతరంగా సాగాయి ఆరాధన, రెండోది జీవితం. జీవితం జయించి ముందుకు దూకింది.

అన్వేషకుడుగా, తీరని దాహంతో, జీవితానికి వెలుగు నింపుదామని బయలుదేరిన రోజున అతడు అటు యిటు చూశాడు. నిశ్శబ్దం నిక్కగా పరుచుకొని వుంది ఆరాధనకు సాక్షిగా నిలిచిన తరువు గంభీరం వహించింది

చిక్కగా పరుచుకున్న నీడలో శాంతాదేవి వంక చూస్తూ అన్నాడు మధుబాబు. "మనిద్దరి హృదయాల నుంచి వచ్చిన భావాలకు సంఘం నిర్మించిన పెళ్లి ఆశ్రయం యిస్తుందనుకోను విశాలత్వాన్ని, స్వాతంత్ర్యాన్ని నియమాల యినుప తీగల మధ్య బంధించిన యీ సూత్రాలను చూచి భయపడవలసిన అవసరంలేదు. నా జీవితం ఒక యాత్రికునిలా దొర్లిపోయి వెలుగును పొందాలి మరల నేను నీ దగ్గరకు వచ్చి నిలబడితే యిప్పుడున్న జ్యోతిని అందివ్వగలవనుకుంటాను."

శాంతాదేవి చాల గంభీరం వహించి అంది "కాలం, సంఘం స్త్రీని నిలువనీయవు. సైగా యీ జ్యోతిని యింటిలో చాటున దాచుకోమని హెచ్చరిస్తుంది అయినా వాటిని అతిగమించి జ్యోతిని నీకు చూపించగలను'.

కృతజ్ఞతతో మెరిసిన కళ్లు ఆమెకేసి తిప్పి, వెనుతిరిగి జీవితపథాన్ని అనుసరించాడు ముందుకు సాగుతున్న తన నీడలను గమనించుతూ ఆ నీడలు అలా వున్నంత వరకు అతనికి నాలుగు కళ్లు నాలుగు

చదివించే విద్యా దాని సంస్కృతి సర్టిఫికెట్ వస్తున్నాయి.

గాఢంతో సాగిన జీవిత పథం మీద అనేక చల్లని మజిలీలు, కాంతిపుంజాలు లభించాయి. రెండు రిసెర్చి డిగ్రీలు, రెండు విదేశీయాత్రలు, అనేక స్కాలర్‌షిప్పులు, పట్టాలు, సన్మానాలు చాల జరిగాయి. తృష్ణలో నుంచి వెలిగిన జీవితం వాటిని చూచి కొన్ని సంవత్సరాలు పొగొట్టుకొందను కోలేదు పొందిందనే అనుకొంది.

గదిలో కూర్చొని ఆలోచనతో కుర్చీ పట్టి సాగింది శాంతాదేవి. గదిలో వున్న దీపం ఆరి వెలుగుతూ వుంది. వెలిగి ఆరి పోతూ వుంది.

తనకు యిప్పుడు నలభై అయిదేళ్ళు. పెళ్ళిలాంటి పాతగుడిసెలో ప్రవేశించి కొంత కాలానికి అందులో ఏమి మిగిలింది అని వెతుక్కొంటే ఆరాధనాజ్యోతి అగుపడలేదు. కాని, సంఘం, తనకు జన్మ యిచ్చి, లోకాన్ని చూపించిన పెంపుడు మనసులు బలవంతంగా ఆ గుడిసెలోకి నెట్టాయి. మొదట అందులో ప్రవేశించిన తరువాత వాన కురుస్తూ వుండగా వెళ్ళి తలదాచుకొన్నట్టుగా వుంది. తరువాత బయటకు వద్దామని అనుకొంది. కాని అందులోని నియమాలు తన చేతులు పట్టి వెనక్కి లాగుతూ వుంటే ఆమె ముందు అడుగు వేయలేకపోయింది.

తను భర్తను ఆరాధించలేదు. ప్రేమించింది. కామించింది కర్తవ్యాలు నెరవేర్చింది. వీటినన్నిటిని మించిన ఆరాధన జ్యోతి దూరంగా వెలుగుతూనే వుంది. ఆ జ్యోతి వరకు వెళ్ళి నూనెపోసి వత్తిని పైకి తీద్దామని అనుకొంటే అంతర్యాన్ని కొలవలేని కొన్నిసూత్రాలు చేతులు చాచి అడ్డుగా నిలబడ్డాయి.

మాతృత్వాన్ని పొందింది. ప్రకృతి వంచిందిందనుకొంది. అలాగే చేసింది కూడ. అయితే పిల్లల్ని ప్రేమించింది. పెంచింది. అయినా దూరంగా వెలుగుతున్న జ్యోతి వంక చూస్తూనే వుంది.

వైధవ్యం ఎదురుపడింది. కళ్ళల్లో నీళ్ళులేవు. హృదయంలో అనుభూతిలేదు. భర్త జీవిత పథంలో ఎదురుపడి కొంచెం సేపు మాట్లాడి ప్రక్కకు తప్పుకుపోయిన పాంథుడిలా అగుపడ్డాడు అందుకే కన్నీళ్ళు లేవు. కన్నీళ్ళు లేకపోవటానికి కారణాలు సంఘం గుచ్చి గుచ్చి అడిగింది. తను యివ్వలేదు. యివ్వాలనుకోలేదు.

ఆ ఆరాధన జ్యోతి వెలుగుతో యీ రోజున ఎదురుపడింది. అయితే ఆమె ఆ వెలుగులో ఆత్మపరిశీలన చేసుకొంటోంది. తననొక పూజారిణిగా భావించుకొంటోంది. అతిథికి యివ్వటానికి ఏమీ మిగలలేదని పశ్చాత్తాప పడుతోంది.

అనేకరకాలుగా ఆలోచించుకొంటూ పచార్లు చేస్తోంది ఎదురుగా రాధామాధవుల చిత్రం వుంది తమాల వృక్ష ఛాయలలో—ఆరాధన వెలుగును కళ్ళల్లో నింపుకొని, ఆంతర్యపు ఆవేశాన్ని శరీరాలలో యిముడ్చుకొని ఒకరి కౌగిలింతలలో మరొకరు వున్నారు.

రాధ...స్త్రీ. తరతరాల ప్రస్తావాహిని.

అరమోడ్పు కన్నులతో ఆ చిత్రం వంక చూచింది శాంతాదేవి కృతజ్ఞతను నింపుకుని రాధ వివాహితే. ఆమె హృదయంలో నివసించింది భర్తకాదు, కృష్ణుడు. రాధా హృదయమే కృష్ణుడి శాంతినిలయము వివాహంలోయిన యిద్దరి వేర్వేరు స్త్రీపురుషుల ప్రేమను సర్వప్రపంచము, సర్వసృష్టి ఆశీర్వదించింది. ఎవరూ విమర్శించలేదు.

ఆరాధనకు నిషిద్ధాలు, నియమాలు వుండాలనుకోవడం తప్పు తెలివితక్కువ అనుకొంది శాంతాదేవి.

ఆ గదిలోనే మరొక ఫోటో వుంది. మీరా. విషం నిండిన పాత్రను కనుల ముందు పెట్టుకొని తన ఆరాధన దేవత ప్రతి, రూపాన్ని వెతకటానికి ప్రయత్నిస్తోంది. మీరా చేస్తున్న ప్రయత్నంలో చేయూత యిచ్చేది ఏమిటో శాంతాదేవికి తెలుసు. మీరా వివాహితే. అయినా మరో మగవాణ్ణి ఆరాధించింది.

మీరా—రాధ యుగ యుగాల స్త్రీత్వానికి ప్రతినిధులు — ఆరాధనా జ్యోతులకు ప్రమిదలలాంటి ప్రమదలు వారు.

మరొక క్రొత్త వెలుగు శాంతాదేవికనుల ముందు విచ్చింది. ఆ వెలుగునకు దూరంగా నిలబడిన సంఘం—వివాహ వ్యవస్థ మాతృత్వం—నియమాలు — కర్తవ్యాలు చివరకు సెక్సు కూడా హీనంగా చూస్తున్నాయి.

కొంత వెలుగును వెంటవేసుకొని బయటపడి చక చక అడుగులు వేసుకొంటూ హోటల్ చేరింది మనసుకన్న వేగంగా పోయిన చేతులు గది తలుపు తీసుకొని లోపలకు వెళ్ళింది గదిలో అంతా చీకటిగావుంది. చీకటిలో నయనాలంకృత దృష్టులను సారించింది. మంచానికి ఆనుకొని క్రింద కూర్చొని ఆలోచిస్తున్నాడు మధుబాబు.

వెంటనే లైటు వేసింది. గదినిండా వెలుతురు పులుముకొంది. మధుబాబు ఉలిక్కిపడి అడిగాడు "ఎవరు?"

"నేనే"

శాంతాదేవివంక కొన్ని క్షణాలు అలాగే చూస్తూ నిలబడిపోయాడు.

"ఏం? ఆశ్చర్యపడుతున్నావా?

"లేదు, సంతోషిస్తున్నాను. కాని, ఇంత రాత్రివేళ నిశ్చయంగా ఎందుకు వచ్చావు?"

"నా నిర్ణయం తెలియజేయటానికి"

"ఏమిటది?"

"ఇప్పుడుకాదు, రేపు అయిదు గంటలకు కొండమీదకురా."

"యీ నిర్ణయం చెప్పటానికి అంత దూరంనుంచి ఒంటరిగావచ్చావా?"

"భయంలేదు. కాలమేకాదు, ఆలోచన కూడ స్త్రీని తరుముతూ వుంటుంది."

మధుబాబు నవ్వుకున్నాడు. మరల తలఎత్తి చూసేవరకి శాంతాదేవి అక్కడలేదు. గది తలుపులు దగ్గరకులాగివున్నాయి.

ఆమె వెలిగించిన వెలుగులో మరోసారి నవ్వుకున్నాడు మధుబాబు.

* * *

"శాంతీ" భర్త పిలుపు

"అమ్మా" కొడుకు అరుపు

"శాంతీ"

"అమ్మా"

కర్తవ్యం ఎదురుతిరిగింది. మాతృత్వం స్పందించింది. గదిలో ప్రతిధ్వనిస్తున్న కేకలకు కారకులు ఎవరూలేరు అక్కడ కాని, శాంతాదేవి హృదయం చిల్లులు పడేట్టుగా వినిపిస్తున్నాయి పిలుపులు

చెవులు మూసుకొని గదిలో నలువైపుల చూచింది. ఎదురుగా తన ప్రతిబింబం— అద్దంలో తనరూపం అగుపడింది. ఆ



కూడా ఆమె కళ్లకు కట్టినట్లయిదేళ్ల స్త్రీగాడేదు పాతిక సంవత్సరాలు వెనుకకు వెళ్లిపోయింది ఆమె హృదయంలో తెలియని ఆవేశం—అర్థంకాని ఆవేశం సాహ సంతో కూడుకొని ఉప్పెనలా ముందుకు విరిరుచుకున్నాయి.

ఆ ఆవేశంతోనే గోడమీదకుచూచింది. అక్కడ భర్త ఫోటో వ్రేళ్లాడుతోంది.—ఆ ఫోటోను చూడగానే ఆమె ఆత్మను, హృద యాల్ని పిండిగాచేసి గాలికి ఎగురకొట్టి నట్లుగావుంది. వెంటనే ఆమె కళ్లల్లో నీళ్లు కూడా తిరిగాయి.

తెర తెరలుగా సాగుతున్న యీ పాతికేళ్ల జీవితంలో తను ఏమి పొందింది?

భర్త ప్రేమా?

మాతృత్వమా?

సంఘం యిచ్చిన మంచితనమా?

మొదటి రెండూ తనకు అనుభవమే ఆ రెండు తనని జయించలేవు. యికపోతే, సంఘం తనని విమర్శించుతూనేవుంది. చచ్చి పోయిన తర్వాతకూడ విమర్శించుతుంది.

భర్తని ప్రేమిస్తూ ఆరాధనవంక చూచింది.

కర్తవ్యాల్ని నిర్వర్తిస్తూ ఆరాధనవంక చూచింది.

మాతృత్వాన్ని పొందుతూ ఆరాధనవంక చూచింది.

ఫోటోముందు నిలబడి తలవంచింది. రెండు కన్నీటి బిందువులు ఆమె కన్నులలో నుండి జల జల క్రిందకురాలాయి. వెంటనే ఫోటోవంక చూచి రెండు చేతులుజోడించి అంది "ప్రభూ! స్త్రీలో రెండు ప్రవంతులు పొంగటం పాపంకాదు. జీవితపు చివరి అధ్యాయంలో ఎదురుపడిన అతిథికోసం అన్నిటిని అధిగమించి వెళుతున్నాను. క్షమించు."

కొంచెం సేపు అలాగే నిలబడి బయటకు వచ్చింది. బయట వరండాలో పెద్ద కొడుకు చక్రధర్ వాలు కుర్చీలో పండు కొని పుస్తకం చదువుకొంటున్నాడు. చప్పుడు చేయకుండా మెమ్మదిగా వరండా మెట్లుదిగి క్రిందకు వచ్చింది. చప్పుడు చేస్తే 'అమ్మా' అని పిలుస్తాడు చక్రధర్, ఆ పిలుపుతోవున్న కర్తవ్యాలు తన కాళ్లకు యినుప సంకెళ్లు వేస్తాయి. అయినా తను వెనుకడుగు వేయదు.

కాని వెళ్తున్న ఆమె అడుగులు హఠా త్తుగా ఆగి పోయాయి "అమ్మా... అమ్మా ఎక్కడికి వెళ్తున్నావు? నువ్వు లేకపోతే మేము చచ్చి పోతాము......"

# యుగధార

వెళ్లకమా'' ఎవరో వచ్చి ఆమెను చుట్టి వేసినట్లు, కాళ్లకు పెనవేసుకున్నట్లు గాను వుంది. కొంచెం సేపటికి తేరుకుని చూస్తే అక్కడ ఎవరూ లేరు. చక్రధర్ కుర్చీలో పడుకొని పుస్తకం చదువు కొంటున్నాడు.

గుండెలవేగాన్ని తగ్గించి, ముఖాన పట్టిన చెమట బిందువులను తుడుచు కుని వడివడిగా అడుగులు వేసింది.

సూర్యుడు కొండ చాటుకు పూర్తిగా వరిగి పోయాడు. ఒక్కొక్క మెట్టే ఎక్కుతున్న శాంతాదేవికి చివరి మెట్టు ఒక్కటే గమ్యంలా అగుపడ్తోంది. ఒక్కొక్క మెట్టు ఎక్కుతూవుంటే 'తన' అనే ఒక్కొక్కదాన్ని వదలి వేసినట్లుగా వుంది. మెట్ల మధ్య వరకు వెళ్లిపోయిన తర్వాత ఆమె ఆగిపోయింది.

ఎదురుగా మధుబాబు నిల్చుని వున్నాడు. పై నుంచి సగం మెట్ల వరకు దిగి వచ్చాడాయన.

"పైనుంచి ఎందుకు దిగావు మధూ?' శాంతాదేవి అడిగింది.

"సగం మెట్లుదిగి నిన్ను పైకి తీసుకు వెళ్లటంలో కలిగే ఆనందం అనుభవిద్దామని'' ఆ పైన శాంతాదేవి మాట్లాడలేదు. మధుబాబు శాంతాదేవి చేతిని తన చేతిలోకి తీసుకొని మెట్లు ఎక్కసాగాడు. శాంతాదేవి ఆయనను అనుసరించుతోంది. చివరి మెట్టు ఎక్కే సరికి ఆమె హృదయం, జీవితం, మెదడు— అన్నీ క్రింద వదలిపెట్టి వచ్చేసినట్లుగా వుంది శూన్యంగా నిలబడిన జీవితపు వాకిలి తెరచివుంది. అందులో ఆరాధనా ప్రవంతి పొంగి పొర్లాలి.

యిద్దరూ కొండపైకి వెళ్లారు పైన ఆకాశం నీలిరంగు పులుముకొని నిర్మలంగా వుంది. కొండమీదవున్న చిన్న చిన్న పొదలు గంభీరం వహించాయి. క్రింద నుంచి పైకి వరకు పెరిగిన మెట్లు వెనక్కి తిరిగి చూచుకొంటున్నట్టుగా నిల బడ్డాయి.

నలు ప్రక్కల చూచింది శాంతాదేవి క్రింద ఎక్కడో తిరుగుతున్న మనుష్యులు చిన్న పురుగులులా అగుపడుతున్నారు వాళ్ల వంక జాలిగా చూచింది ఆమె. వాళ్లల్లోనే బాధ్యతలు, కర్తవ్యాలు— నియమాలు— సూత్రాలు— సంఘం అరుపులు అన్నీ కొట్టు కొంటున్నాయి.

వాళ్లవంక జాలిగా చూడటం తప్ప ఏమీ చేయలేదు శాంతాదేవి. ఆమెవంక క్రీగంట చూస్తూ ఆమె మెదడులో కదిలే ఆట ఏమిటో గమనించి అన్నాడు మధుబాబు "ఏమిటి ఆలోచిస్తున్నావు శాంతా!"

"ఏమీలేదు. కొన్ని గంటల క్రితం అతిథికి యివ్వటానికి ఎవ్వరూ ఏమీ మిగల్చలేదని పించింది కాని అన్నీ నాఅంతట నేనే పోగొట్టుకున్నానని తెలిసింది."

"తరతరాల స్త్రీత్వం తరువాత వాళ్లకు యిచ్చిన వరమదే. జీవితంలో వెలుగు తున్న క్షణాల వెలుగులోనే అన్నీ పొందటం నేర్చుకోవాలి'' అంటూ శాంతాదేవిని తన మీదకు లాక్కున్నాడు మధుబాబు. ఆ విశాల హృదయంలో ఏదో శాశ్వత శాంతిని వెతుక్కుంటూ వుంది శాంతా దేవి.

"యీ క్షణంలో వున్న అనుభూతిని జీవితపు గ్రంధంలో మొదటి నుంచి చివర వరకు వ్రాస్తాను శాంతా'' ఆమె నడుము చుట్టూ చేయివేసి మరింత గట్టిగా తనకేసి అదుముకున్నాడు.

శాంతాదేవి ఆయనను పెనవేసుకుంది.

వయస్సు, అనుభవం వెకిలిగా నవ్వటం మానివేసి ఏదో గొణుక్కుంటూ చాటుకు తప్పుతున్నాయి.

యుగధార వాళ్లిద్దర్ని తడిపి ముందుకు దొర్లింది.

అందులో నుంచి వెలిగిన జ్యోతి బొమ్మరిల్లులాంటి నాలుగు రాళ్లమధ్య దివ్యంగా వెలుగుతూ వుంది.



# కద్రి మంజునాథస్వామి దేవాలయము

ఫొటోలు, వ్యాసం ఎన్. రామకృష్ణ



మెట్టమీది జోగి మఠంలో మరికొందరికి చెందిన ఆలయాలు

పూర్వం యోగీశ్వరుడైన మత్స్యేంద్ర నాథుడు దేశ సంచారంచేస్తూ, కేరళరాజ్యానికి వెళ్ళాడు. అప్పటి కేరళకు 'ప్రమీల' మహారాణిగావుండేది. ఆమె మత్స్యేంద్ర నాథుని మహత్తుకు ముగ్ధురాలై వెంటనే అతని శిష్యురాలిగా మారిపోయి ఆయన మతాన్ని స్వీకరించింది. ఆమె తన పేరు మార్చుకుని 'మంగళి' అయింది. మత్స్యేంద్ర నాథుడు నాసిక్‌లో జరగబోయే యోగి సమ్మేళనానికి హాజరు కావలసివుంది. కాని తన ధ్యాన సమాధిలో ఆయన ఆ విషయాన్ని మరచిపోయాడు. అతని ప్రథమ శిష్యుడు గోరక్‌నాథుడు మత్స్యేంద్రనాథుడ్ని వెతుక్కుంటూవచ్చి,ఆయన కా విషయాన్నిగుర్తు చేశాడు. ముగ్గురూ నాసిక్‌కు బయలుదేరారు. దారిలో నేత్రావతీ నదీతీరాన మంగళి సత్తువ వన్నగిల్లిన కారణంచేత అక్కడనే ఉపశమించాల్సివచ్చింది. ఆమె నివాసంకోసం ఒక పర్ణశాల నిర్మించారు. తదుపరి గోరక్‌నాథుడా పర్ణశాలను ఒక ఆలయంగా మార్చి అందులో 'శక్తి' దేవతను ప్రతిష్ఠించి దానికి 'మంగళాదేవి ఆలయం' అని నామకరణం చేశాడు. ఆలుప చక్రవర్తుల్లో ప్రశిద్ధుడైన కుందవర్మ క్రీ. శ. 968 వ సంవత్సరంలో ఈ ఆలయాన్ని పునర్నిర్మించాడు. మంగళాదేవి వెలసివున్న యీ ప్రదేశం 'మంగుళూరు'అయింది. మంగుళూరు గురించిన స్థలపురాణంగా యీ కథ చెబుతూవుంటారు.

ఈ మంగుళూరుకు రెండు మైళ్ల దూరంలో 'కద్రి' అనే ప్రదేశం వుంది. శ్రీ మంజునాథస్వామి దేవాలయం వున్నది ఇక్కడే. చరిత్ర ప్రసిద్ధమైన యీ దేవాలయం విశేషజనాన్నాకర్షిస్తున్న దక్షిణ దేశ దేవాలయాల్లో ఒకటి.

ఆలయం చుట్టుప్రక్కల ప్రదేశంలో చాలారాతి గుహలున్నాయి. పాండవులుఅరణ్యవాసం చేస్తూన్నప్పుడు యీ గుహల్లో నివసించారని ప్రతీతి. సీతపేరుతోవున్న ఒక

'బావి' రామాయణకాలాన్ని కూడా దృష్టికట్టిస్తుంది. నవ చతురస్రాకారమైన ఒకపెద్ద చెరువుకూడా యిక్కడవుంది. దీన్నే 'నవ నాధకుండ' అంటారు. 'గోముఖ భాగీరధ తీర్థం' మరొక విశేషాకర్షణ. రాతితోమలచబడిన నందీశ్వరుని నోటినుంచి సంవత్సరం పొడుగునా నీరు ధారగా ప్రవహిస్తూ వుంటుంది. ఈ నందీశ్వరుని ఎగువన విఘ్నేశ్వరాలయంవుంది.

మంజునాధస్వామి దేవాలయాన్నిగురించి వివిధమైన కథలు చెప్పబడుతూవుంటవి.

ఒకప్పుడు, పరశురాముడు తనకున్నదంతా బ్రాహ్మణార్పితంచేసి, సర్వాన్ని త్యజించి పరమేశ్వరుడి గురించి తపస్సు చేశాడు. పరమేశ్వరుడు అనుగ్రహించి, 'స్వర్ణ కదళీవనా'నికివెళ్ళి అక్కడ ప్రార్థించమన్నాడు. పరశురాముడు పరమేశ్వరునిగూర్చి తపస్సు చేసిన 'స్వర్ణ కదళీవనమే' ఈ ప్రదేశమని, పరశురాముడ్ని బ్రహ్మ విష్ణు సర్వేశ్వరుల రూపంతో ఈశ్వరుడు సాక్షాత్కరించింది ఇక్కడేనని, దీనినే పూర్వం 'స్వర్ణకదళీవనం' అనేవారని ఒక స్థల పురాణం.

ఈ ఆలయాన్ని గురించిన మరో కథ కూడా జనవ్యాప్తంగావుంది: శివుని అవతారమైన మత్స్యేంద్రనాథుడు, పార్వతీదేవి అవతారంగా 'మంగళాదేవి', వారి అంతేవాసియైన గోరక్‌నాథునితో యీ ప్రదేశానికి విచ్చేసి శివలింగ ప్రతిష్ఠాపన చేయ సంకల్పించారని, కాశీనుంచి శివలింగాన్ని తీసుకురావడానికి గోరక్‌నాథుడు పంపబడ్డాడని, గోరక్‌నాథుడు కాశీకివెళ్ళి తిరిగిరావడం ఆలశ్యమైన కారణంచేత మత్స్యేంద్రుడు శివుడ్ని ప్రార్థించాడని, అక్కడ రసాతలంనుంచి 'స్వయంభువులింగము' వెలసిందని, గోరక్‌నాథుడు తెచ్చిన లింగము స్వయంభువు లింగము దగ్గరే మొదట వుంచబడిందని తర్వాత 'వదిరాజస్వామీజీ' ఆధ్వర్యాన ధర్మశాలలో పునర్‌ప్రతిష్ఠించబడిందని అంటారు.

యోగిపుంగవులైన మత్స్యేంద్రనాథుడు, గోరక్‌నాథుడు, చౌరంగీనాథుడు నివసించిన యీ ప్రదేశం యిప్పటికీ కూడా ఋష్యాశ్రమంగానే ఉన్నది. ఈ ఆలయంతూర్పువైపునున్న ఒక మిట్టమీద 'సాధుమఠం' ఉన్నది. కైలాసనాధస్వామితెగకు చెందిన సాధువులు యిక్కడ నివసిస్తారు. పన్నెండేళ్లకొకసారి మఠాధిపతి ఎన్నిక జరుగుతుంది. మఠాధిపతి 'అగ్నిగుండం' చేరువుగా ఆశ్రమవాసియై వుంటాడు, అగ్నిగుండం



**ఆలయ ప్రాంగణంలో పొడవైన దీప స్తంభం** లోని శిఖలు సర్వవేళలా రగుల్తూనే వుంటాయి. ఆదిలో పరుశురాముడు ఈ అగ్నిని ముట్టించాడని ప్రతీతమైవుంది.

ఈ మఠంలో పరశురాముడు నెలకొల్పిన 'కాశీ కాలభైరవ' ఆలయం ఒకటివుంది. జలాంత్రనాథుని అంకితమైన ఆలయమూ, చౌరంగీనాథుడు, గోరక్‌నాథుడు, మత్స్యేంద్రనాథుడు ఆదిగాగలవారికి సంబంధించిన ఆలయాలు కూడా ఇక్కడ ఉన్నాయి.

ఇప్పుడు మఠాధిపతి శ్రీ శాంతినాథఉర్స్. దేవాలయానికి సంబంధించిన ఉత్సవాల్లో వీరిని గుర్రంమీద వూరేగిస్తారు. ఈయనను 'జోగి మహరాజ్' అని కూడా పిలుస్తూ వుంటారు.

ఆలయ శిల్పాల్లో బుద్ధుడు, మంజుశ్రీ మొదలైనవారివి కూడా మలచబడి ఉన్నాయి. ఆలయప్రాంగణంలో సుమారు ముప్పయి అడుగుల ఎత్తుగల దీపస్తంభం ఉన్నది.

పురాణేతిహాసాల దర్పణమైన యీ మంజునాధస్వామి దివ్యక్షేత్రము మహిమాన్వితమైనది, చూడచక్కనిది



గోముఖ భాగీరథతీర్థం–సంవత్సరం
**పొడుగునా ప్రవహించే నీటిధార**

# వారఫలం

**23-9-1966 శుక్రవారం మొదలు 29-9-1966 గురువారం వరకు.**

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వ్యాపారంలో మీకు నష్టం కలిగించడానికి యితరులుచేసే ప్రయత్నాలే మీకు లాభదాయకంగా మారగలవు సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు ఫలిస్తాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**వృషభం :** ఇదివరకు కొన్ని వ్యవహారాల్లో యేర్పడిన అనిశ్చిత పరిస్థితి తొలగిపోవడంవలన మానసికంగా విశ్రాంతి లభిస్తుంది. అవసరానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికివస్తుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ప్రయాణాలు ఫలించగలవు.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు శ్రమ మీద నెరవేరుతాయి. శుభమూలంగా వ్యయం జరుగుతుంది.

**మిధునం :** వారం ప్రారంభంలో వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి వృత్తిలో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది. ఆర్థికంగా మీ స్వంత వ్యవహారాలు బాగానే ఉన్నా, యితరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది దూర ప్రయాణాలు వాయిదావేయడం మంచిది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది సంతానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

**కర్కాటకం :** అన్ని వ్యవహారాలు అనుకూలంగానే కన్పిస్తాయిగాని మీరు యేమాత్రం యేమరుపాటుగా ఉన్నా, వృత్తి వ్యాపారాల్లో అవస్థపడి, అనుభవం మరొకరిది కాగలదు. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి. మానసికాందోళన కలుగుతుంది ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు సంతృప్తికరంగా నెరవేరుతాయి

**సింహం :** మీ ఆలోచనలు మీ స్వంత వ్యవహారాల్లోకంటే యితరులకు సలహారూపంలో బాగా ఉపకరిస్తాయి. ఆదాయంమాట యెలాగ ఉన్నా, అవసరానికి ఏదో ఒకవిధంగా డబ్బు చేతికివస్తుంది. శుభమూలంగా వ్యయం జరుగుతుంది. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**కన్య :** మీకు ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అనుకూలతను సాధించగలరు. సాహసములోకూడిన వ్యవహారాలు కూడా ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అధికారులుకూడా ఆమోదిస్తారు. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి.

**తుల :** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు మాత్రం బాగా ఉంటాయి కొన్ని వ్యవహారాల్లో అధికవ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒత్తిడివస్తుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి సాహసముతోకూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు—శుభకార్యాల విషయంలో అనుకూల వార్తలను వింటారు పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు** రావలసిన డబ్బు సమయానికి అందడం వలన అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి వృత్తిలో ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి వ్యాపారంలో యిదివరకు చేజారిపోయిన అవకాశాలు తిరిగి లభిస్తాయి స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు

**మకరం :** వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమ కలిగినా దానికి తగిన ప్రతిఫలం లభించగలదు. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో మిత్రుల సహకారం లభిస్తుంది ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు

**కుంభం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు వారం ప్రారంభంలో కంటే వారాంతంలో బాగా ఉంటాయి. ఉద్యోగంలో మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది నూతన వ్యాపారాలు ప్రారంభించడానికి యిది సమయంకాదు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధు మిత్రులను కలుసుకొంటారు.

**మీనం :** ఇప్పుడు మీరు చేసే ప్రయత్నాలు కొన్ని వ్యర్థమైపోయినట్లు కన్పిస్తాయిగాని వాటి ఫలితాన్ని ముమ్ముందు మీరుపొందగలరు సాహసముతో కూడిన వ్యవహారాల్లో వారం మధ్యలో నష్టం వస్తుంది ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగాఉంటాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలనువింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

—మహేష్




### జ రి గి న క థ

ఆమ్రపాలి అందచందాలను గురించి విన్న మగధరాజు బింబిసారుడు ఆమె నెలాగైనా తన దాన్ని చేసుకోవాలనే ఉద్దేశ్యంతో వైశాలినగరంలో పుత్తలికల సూత్రధారుడుగా ప్రవేశిస్తాడు. రేవా ఆదేశానుసారం పాలి భవనంలో ప్రవేశించి ఆమెదృష్టిని ఆకర్షిస్తాడు. తనగురించి అడిగిన పాలికి అప్పటికప్పుడు తానేమీ చెప్పలేనని సమాధాన మిస్తాడు బింబిసారుడు. పాలి భవిష్యం నిశ్చితం అయే అరోజు సంథాగారంలో సభాసదులంతా మహానాముని రాకకోసం ఎదురుచూస్తుంటారు. ప్రవేశి పుస్తకంలో పేర్కొన్న విధంగా పాలి భవిష్యాన్ని నిర్ణయం చేస్తాడు మహానాముడు పాలీ, బింబిసారుల వివాహం అవుతుంది. మహానాముని నిర్ణయం, తాను వివాహ మాడింది మగధరాజానని విన్నతర్వాత బింబిసారుని అనుసరించడానికి నిరాకరిస్తుంది ఆమ్రపాలి. మహానాముడు మరణిస్తాడు తండ్రి ఉద్దేశాను సారం దేశవర్తకి అవటానికే నిశ్చయించు కుంటుంది సంధాగారంలో పాలి నృత్యం చేస్తుంది నృత్యానంతరం ఆమె లిచ్ఛవీయుల స్మశానవాటిక వైపు వెళ్ళి తండ్రిని స్మరించింది

## 17

ఆంతిమ స్వరం ఉచ్ఛ స్వరంలో పలుక బడ్డంవల్ల రేణుక వింది. పాలి దగ్గరకు వెళ్ళి ఆమె ఆశ్చర్య పడింది. పాలి కపోలం మీద అశ్రుధార ప్రవహిస్తోంది స్వయంగా మహానాముని తనూజాత కాదని తెలిసినా, నేడు అతని వంశజయైన కర్తవ్యం సఫలమైంది. ఆమె ముఖం, సమస్త శరీరం పులకరించాయి. ఆమె ఆత్మను మలిమివేసే బంధనం శాశ్వతంగా దూర మైనట్లనిపించింది. సంథాగారంలోని నృత్యానికి వెనకగల ప్రేరణ ఇప్పుడు రేణుక కనుక్కుంది. పాలి కళ్ళు తెరిచింది. రేణుక ప్రేమ పూర్వకంగా అశ్రువులు తుడిచింది. పాలి అంది —

'తల్లీ, నీవిప్పుడు ఇక్కడి నుండి నిశ్చింతగా వెళ్ళిపో. నీ జీవితాన్ని సార్థకం చేసుకో. నేటి నుండి నేను నీ స్థానాన్ని గ్రహిస్తాను. దాన్ని నేను చక్కగా నిర్వర్తిస్తాను.'

'కాదమ్మాయీ, నేను వెళ్ళే సమయం ఇంకా అవలేదు. అయిదు నెలల తరువాత వస్తుంది.'

'అయిదు నెలలా?' అని పాలి తల వంచుకుంది. రేణుక ఆమె హస్తం పట్టుకుని రథం వైపు తీసుకు పోయింది.

మహావనం వజ్జీయులతో నిండి పోయింది. తమ తమ వివిధ అలంకారాల్ని అలంకరించుకొని కన్యలు, యువతులు, వృద్ధ వనితలు అక్కడికి వచ్చారు. మద్య ప్రియులైన యువకులు, యువ్వన ప్రియులైన వృద్ధులు మదగజాల వలె వూగుతున్నారు. మహావనం నేడు భోగవిలాసాలకి ఆకరమైంది. అచ్చట వజ్జీయుల ఐశ్వర్యానందాలు తమ కాంతి చేత ప్రపంచాన్ని మిరుమిట్లు గొల్పు తున్నాయి. కారణం, ప్రపంచంలోని శ్రేష్ఠ వస్తువు వొకదాన్ని— అది వారికి లభ్యం కాక పోయినా సరే— వాళ్ళు నేడు తప్పకుండా చూడ బోతున్నారు.

పాలి అకస్మాత్తుగా ఆనందవనంలో ప్రవేశించింది. కొంత సేపటి వరకూ అక్కడి కోలాహలం ఉపశమించింది. నేడు పాలిని చూడ్డానికి దూరదూరాల నుండి రసికులైన వజ్జీయులు, లిచ్ఛవీయులు వచ్చారు. పాలి వచ్చి ఒక ఆమ్ర వృక్షం క్రింద నిల్చుంది. వృక్షానికి సమీపంగా గుండ్రని శిలాసనం అలంకరింప బడింది. సంవత్సరాలకి పూర్వం అభిరాముడికి ఈ ఆమ్ర వృక్షం క్రిందనే పాలి లభించింది.

సంగీతం ప్రారంభమైంది. తక్షణం నెందడి సద్దు మణిగింది. పాలి ప్రథమ అంగచాలనమే దర్శకుల్ని ముగ్ధుల్నిచేసింది. పాలి కళాపూర్ణమైన అంగచాలనం, తనుశోభ, ఆకర్షక దర్శనం, కళ్ళు, పెదవులు చేతులు, కాళ్ళు— అన్నీ అనృత్యమయ అభినయాన్ని ఉచ్ఛతరం చేస్తున్నాయి. ద్రష్టలు క్రమంగా నాట్యంతో పాటు తాళం వెయ్యసాగారు. ఇలా ఒక నృత్యం పూర్తయింది.

నృత్యం పూర్తికాగానే ప్రశంసారవంతో ఆకాశం ప్రతిధ్వనించింది. రేణుక కంగారు పడింది. కారణం, పాలి తక్షణమే రెండవ నృత్యం ఆరంభించవలసి వచ్చింది. జన సమూహం ఆమంత్రణాన్ని అంగీకరించక పోడం క్రింద పడుతూన్న ఆకాశాన్ని అడ్డుకోడం లాంటిది. రెండో నృత్యం ఆరంభ మైంది. దానితరవాతకూడా ఆ ఆనందధ్వని ప్రతిధ్వనించింది. పాలికి మూడోసారి నాట్యమారంభింప వలసి వచ్చింది. గత్యంతరం లేదు. రేణుక కలతపడి ఇటూ అటూ పరుగెత్త సాగింది. దర్శకులకు నచ్చచెప్ప సాగింది. మూడవ నృత్యం కూడా పూర్తయింది మళ్ళా ఒకసారి స్తోత్ర ఆనందాల మిశ్రమరవం మారు మ్రోగింది.

పాలి శరీరవయువాలన్నీ అధిక శ్రమచేత అలసిపోయాయి. ఆమె కోమలగాత్రంపై స్వేదధారలు ప్రవహిస్తున్నాయి. ఆ హర్ష ధ్వనిలో పాలి నాలుగోసారి మళ్ళీ నిలబడింది. కాని నృత్యానికారంభంలోనే మొదటి అభినయం పూర్తయిందో లేదో ఆమె క్రింద పడిపోయింది.

మహావనంలో ఒక్కసారిగా హాహాకారం వ్యాపించింది. రేణుక కేకవేసి, పరుగెత్తి పాలిని తన ఒడిలోకి చేర్చుకుంది. నేటి మహోత్సవం పాలి అనుపమమైన నృత్యంతో ఆరంభించి, నృత్యానంతరం ఇలాంటి అనుపమఘటన వల్ల మందమైంది. కాని పాలి నేటినుండి వజ్జీయుల దృష్టిలో భూత భవిష్యాలకు అద్వితీయ నర్తకి అయింది.

కొంతసేపటికి పాలికి తెలివివచ్చింది. ఆమెదృష్టి మొట్టమొదట అభయునిపై బడింది. అతడు తన ఎప్పటి విషపూరిత హాస్యంతో పాలి కాళ్ళదగ్గర నిలబడ్డాడు.

మహావనంనుండి తన ప్రాసాదానికి

వచ్చిన తరవాత కూడా చాలా సేపటి వరకూ అలాగే నిశ్చేష్టమై పడివుంది. అభయుడు కూడానే ఉన్నాడు. రేణుక శయన గృహంలోంచి ఇవతలికి రమ్మని అతనికి సంకేతంచేసి శయనాగారం ద్వారాన్ని మూసివేయించింది. అప్పుడు ఆమె అభయునితో ఉద్యానంలోకి వచ్చి కూర్చుంది. 'రేణూ, పాలి యీ మహలును ఒక వెయ్యి మంది యువకులు చుట్టుముట్టారు, నీకు జ్ఞాపకముందా?

'మీరు వాళ్ళకి నచ్చజెప్పి పంపివేయ 'మొట్టమొదటా?' అని రేణుక ఆక్షేపించింది.

'అవును' అని నిండు విశ్వాసంతో వృద్ధుడు అభయుడు. జవాబిచ్చాడు.'

రేణుక నవ్వి అంది. —'అభయరాజా, అజితుడననే గర్వం నీకెప్పుడూ ఉంది. నన్ను దేశనర్తకిని చేసినప్పుడు నీలో ఉన్న నైచ్యం, స్వేచ్ఛ, పశుత్వం నేడు సహస్రగుణాలు వృద్ధి పొందాయి. ప్రకృతి వాటిని ఎలా పెరగనిచ్చిందో ఈశ్వరునికే ఎరుక!......కాని ఇప్పుడు వార్ధక్యంలో నివి నవ్వు తెరిపించి గలవు: కాని ఇప్పుడు దాని నీకు లభించదు?

'చూస్తాను.'

'చూడవలసింది కాదు విషయం. వినవలసింది. విను... పాలి శయన గృహంలో ఒంటరిగాలేదు. ఆమె శరీరంలో ఇంకో ప్రాణికూడా ఉంది. అది సరిగా అయిదు మాసాలు గడచిన తరువాత అందరికీ దర్శనమిస్తుంది. .. అప్పుడే వృద్ధుడు అజితుడు అగు అభయరాజా పాలికి అందరికంటే ముందుగా పొందు పురుష



దానికి రెండు జాములవరకూ ప్రయత్నం చేసిన సంగతికూడా నాకు తెలుసు.'

'ఇప్పుడు దానికి మూల్యం లభిస్తే సరిపోతుంది. కాని నేడు ఇక్కడ ఉండే అధికారం నాది'

'అభయరాజా, విను'

'చెప్పు నీవు కూడానాకు ఉపదేశం ఇవ్వగోరుతున్నావా? మహానాముడూ అలాగే చేసేవాడు. కాని ఈ ఉపదేశకులంటే నాకెప్పుడూ అసహ్యమే. మొట్టమొదట పాలిని పొందాలనినేను నిశ్చయించుకున్నాను.'

పించక పోతే ఉచ్చస్వరంతో చెప్తాను, విను. 'పాలి నీముఖం మీద బలంగా కొట్టింది. ఆమె నిన్నోడించి విజితుణ్ణి చేసింది— పాలి కన్యకాదు'

'రేణూ, నన్ను మూర్ఖుణ్ణిగా చేసే మాట ఆడకు.'

'లేదుమహాశయా, మీరు మూర్ఖులయ్యారు. దాని మాట చెప్తున్నాను'

'శయన గృహద్వారం మూయబడ్డం చేతనా, ఇలా అంటున్నావు?'

'కాదు, వాటిని నీఅధికారం ఉపయోగించి పించాం వేరొకటి అని తెలుసుకోగలడు అందుకే నేను ద్వారాన్ని బంధించాను. అయిదు నెలల తరవాత తెరవబడుతుంది. నమస్తే"

రేణుక వాక్యమింకా ముగియనేలేదు తలుపులు తీయబడ్డాయి. పాలి వెలుపలికి వచ్చింది. ఆమె ప్రాసాదానికి ప్రవేశద్వారం వైపు పరుగెడుతోంది. రేవా, తక్కినదాశి దాసీ జనం ఆమె వెనకాల పరుగెత్తసాగారు. అభయుడు రేణుక విస్మితులై పరుగెడుతూ ప్రవేశ ద్వారం దగ్గరికి వచ్చి చేరారు, అప్పుడు వాళ్ళకి కనువిప్పు కలి

గిరిది: రక్తరంజితమైన ఖడ్గాన్ని చేతిలో తీసుకొని సుధీరుడు ద్వారానికి మధ్యగా నిల్చున్నాడు. బలవంతంగా ఆపే ప్రయత్నంలో యువకు లిద్దరూ ఖండింపబడ్డా పాలి అక్కడికి పరుగెత్తి రాకపోతేమరి కొందర్ని అతడు దీర్ఘనిద్ర పుచ్చిఉండే వాడే. కాని, పాలి రాక చూచి క్రోధం వల్ల కలిగిన అతని వణకు ఒక్కసారిగా ఆగిపోయింది.

అతడు స్థిర దృష్టితో పాలిని రెప్ప వాల్చకుండా చూడసాగాడు ఆమెమంద హాసం చేసి అతని వైపు సాగింది. సుధీరుడు ఖడ్గాన్ని విసిరేసి మొగంతిప్పి రెండో వైపు వెళ్ళసాగాడు. సుధీరునికి తనమీద విర్రిప్రేమ కలదని పాలి గ్రహించింది. సుధీరుడు తన గ్రామంనుండి ఇక్కడికి పరుగెత్తు కొచ్చి పాలి ప్రాసాదంలో ప్రవేశించునప్పుడు అడ్డు వచ్చిన వాని చేతిలో నుండి కరవాలాన్ని లాగుకొని అడ్డువచ్చిన మరో ఇద్దరి ప్రాణాలు తీసినట్లు ద్వార సమీపంలో జరిగినరహస్య భాషణం, ఆర్తనాదం మూలంగా ఆమెకు తెలిసింది. సుధీరుణ్ణి కొంతసేపటి దాకా చూశాక పాలి అంది —

'రేవా, నేటినుండి మన మహల్లో ఈ పిచ్చివాడికి నివాసం ఏర్పాటుచెయ్యి.'

ఇలా అని ఆమె మెల్లగా శయన గృహం వైపు వెళ్ళింది. ఆమె అభయుణ్ణి కాని, రేణుకను గాని చూడలేదు.

రాత్రి అయింది. పాలి వ్యాకులపడి శయ్యమీద ఇటూ అటూ దొర్లుతోంది. తన ప్రియుడు దుఃఖితుడు అవడం చూచే దురదృష్టం కలిగించిన దేవుడు ఎవడా అని ఆమె మస్తిష్కం ఆలోచిస్తోంది. ఆమె ఉన్మత్తుడైన సుధీరుణ్ణి బింబిసారునితో పోల్చసాగింది. ఒకడు తనకోసం ఉన్మత్తుడయ్యాడు. రెండో వానికోసం తాను స్వయంగా అంతగానే ఉన్మత్త అయింది. అకస్మికంగా ఆమె దృష్టి శయ్య దగ్గర ఉంచబడిన పుత్తళిక మీద పడింది. ఆమె దాన్ని హృదయానికి హత్తుకొని కళ్ళు మూసుకొంది.

బింబిసారుణ్ణి మొదట కలిసింది మొదలు అతన్ని ఎడబాసినప్పటి వరకూ జరిగిన మధుర సంఘటన లన్నింటినీ ఒకదాని వెనక ఒకటి స్మరించడంలో ఆమె మునిగి పోయింది. క్రమంగా ఆమె విచ్ఛిన్న హృదయం అనుభూతితో నిండ సాగింది. కళ్ళనుండి అశ్రువులు జాలు వారసాగాయి. ఆమె పుత్తళికను ఆవేశంతో బలపూర్వకంగా హృదయానికి హత్తు కుంది. పాలి అస్థితిలోనే చాల సేపటి వరకూ పడుకుంది

ఆ సమయంలో అభయుడు వెళ్ళి పోయాడు. కాని గ్రహించిన విషయాన్ని అసంపూర్తిగా విడిచే వ్యక్తి కాడతడు. మహానాముని మరణ సమయంలోనూ, తరువాత ఇప్పటి వరకు అతడు పూర్తిగా మౌనంగా ఉన్నాడు కాని ఆ మౌనానికి వెనక అతని పశుత్వం అంతటి ఉత్సాహంతో నిల్చిఉంది. పాలిని పొందాలనే చింత అతని నెత్తి మీద కూర్చుంది వృద్ధావస్థలోని దౌర్బల్యం అతన్ని కళోరుణ్ణిగా చేసింది

అభయుడు రాత్రింబగళ్ళు లెక్కిస్తూ పూర్తిగా ఆరు మాసాలదాకా ఎదురు చూస్తున్నాడు. పాలి నాలుగు నెలల నుండి నందీ గ్రామంలో ఉంది. రాత్రింబగళ్ళు నిరంతరం బింబిసారుణ్ణి స్మరిస్తూ నెలలు నిండిన వెనక పాలి ఒక పుత్రుని కన్నది. ఈ విషయాన్నెంతో గుప్తంగా ఉంచినా అభయునికి తెలిసి పోయింది. కాని అతని గుప్త విషయాలు కొన్ని రేణుకకు తెలియడం వల్ల అతడీ ఘటనను దురుపయోగం చేయలేక పోయాడు. జీవితంలోని చివరి రోజులలో ప్రతిష్ఠ పోతుందను భయంచేత వూరుకున్నాడు.

పాలి పుత్ర జననానికి తరువాత నృత్యంలో ఉత్తమ శిక్షణ పొందేనెపంతో రేణుక వెంట కొన్ని రోజులు ఇటూ అటూ తిరిగి వచ్చింది. ఆమె మనస్సు పుత్రుణ్ణి చూడగానే ప్రఫుల్ల మవుతోంది. పుత్రుని చూడడం వల్ల ఆమెకు బింబిసారుని సాన్నిధ్యం అనుభూత మవుతోంది. కొన్నాళ్ళపాటింకా వైశాలి వెళ్ళకుండా ఉండాలని ఆమె కోరిక కాని నాలుగు వైపులా ప్రఖ్యాత మవడం వల్లా ప్రతి గ్రామంలోనూ ఆమె నృత్యాన్ని గురించి చర్చ జరుగుచుండుట చేతనూ కొద్ది కాలం తరవాతే ఆమె పుత్రుణ్ణి తీసుకొని వైశాలికి వెళ్ళి పోయింది. వచ్చిన తరవాత ఇంత స్వల్పకాలంలో తన్ను ప్రశంసించే వారి సంఖ్య ఎన్నో రెట్లయిందని ఆమె తెలుసుకుంది. పాలి నూతన జీవితం ఆస్వాదించాలని ఉవ్విళ్ళూరింది:

ప్రాసాదంలో కాలు పెట్టగానే ఆమెకు మొట్టమొదట స్వాగత మిచ్చిన వాడు సంధాగారపు వృద్ధ సభాపతి అభయ రాజు. సభాపతి వైశాలీ దేశ నర్తకిని కలుసుకోడం అనుచితంగా భావింపబడదు. అతణ్ణి శంకించడం, విమర్శించడం కూడా వ్యర్థమే. కారణం, వైశాలి సభాపతి చేత దేశనర్తకి ఆహ్వానింపబడటం మిక్కిలి సమంజసం. రాత్రి అవడానికి ముందే రేణుక నర్తకి సాధారణ కర్తవ్యాన్ని పాలి దృష్టికి తెచ్చి ఆమెకు అభయుని సంగతి చెప్పింది.

రాత్రి వడగానే అభయుడు పాలి శయన గృహానికి వచ్చాడు అభయుణ్ణే చూచి పాలి ఏమీ మాట్లాడలేక పోయింది. అలాగే కూర్చుంది. అభయుడు అధికంగా మాట్లాడడం ఉచితం కాదనుకున్నాడు. దీపకాంతిలో పాలి అతని వార్ధక్యం ముందు అధికమైన యవ్వన సంపన్నగా కన్పిస్తోంది. అప్పుడు ఆ వైశాలీ నగరపు భయంకర నరపశువు శయ్యచెంతనున్న దీపాన్ని మెల్లగా ఆర్పి వేశాడు

మరునాటి ఉదయాన్నే వైశాలి అంతటా హాహాకారం వ్యాపించింది పాలి ప్రాసాదానికి సమీపంలోనే తరంగాలతో ఒప్పు తటాక తీరంలో ప్రతిష్ఠ పొందిన అభయరాజా మస్తకం, మొండెము భూమిపై పొరలాడు తున్నాయి అతనికి సమీపంలోనే చేతిలో రక్తరంజితమైన ఖడ్గంతో, హృదయంలో అభిరాముని కరారంతో సుధీరుడు దీర్ఘ నిద్ర పోతున్నాడు ఇప్పుడు అతని ముఖంమీద భయంకర మాత్సర్య రేఖలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

*　　*　　*

రాజ గృహంలోని విశాల బిల్వవనం లోని కలందక నివాసంలో ఈ సమయంలో గౌతమ బుద్ధుడు విహరిస్తున్నాడు. నేడు నాలుగు నెలలు గడవడం వల్ల భిక్షువులకు వస్త్రాదికములైన అవసర వస్తువులు అయిదు (పిండిపత్రం, చవరం, మైసజ్జ, సూది, బీజం) దానం చేయబడు తున్నాయి. నేడాభిక్షుకులు అందరూ నాలుగు వైపుల నుండీ తమ నిశ్చితమైన దిక్కునకు వేర్వేరుగ బయలు దేరుతున్నారు. ఈ సమయంలో శాక్యముని గౌతముడు ఒక రావిచెట్టు దగ్గర వడాదు

టున్నాడు. అప్పుడే బింబిసారుడు తన రథాన్ని కొంత దూరంగా నిలిపి ఆయన దగ్గరకు వచ్చాడు. శాక్యముని కొంచెం అదరిపడి విశ్వాన్ని జయించిన తన చిరునవ్వుతో అతని మీద ఒక దృష్టి ప్రసరించాడు. ఇద్దరూ ఒకరి కుశలం ఇంకొకరు అడిగారు. అప్పుడు బింబిసారుడు అతనికి నమస్కరించి ఒక వైపు కూర్చున్నాడు.

బింబిసారుడు, కొత్తగా ఈతనేర్చినవాడు, నీటిలో కాళ్లూ చేతులూ ఆడించులాగ మాట్లాడసాగాడు—

'భగవన్, నేడు మీరు మీ ప్రయాణాన్ని ఆపండి. నాలుగు నెలల వర్షావాసం అయ్యాక ఒక్క రోజైనా మీరుండరని నే నెరుగుదును. కాని, ఈసారి మీరు తప్పక ఉండాలి — స్వీకరించండి ముని.'

బుద్ధుడు రాజు వ్యాకులాన్ని తెలుసుకున్నాడు. అతని వ్యాకుల హృదయాన్ని శాంతింప జేయడం అవసరమని ఆయనకు తోచింది. ప్రేమపూరిత నేత్రాలతో అతని



శోకమోస్తూ చివర కాయన 'తథాస్తు' అన్నాడు.

బుద్ధుని ఈ మాటలు వినగానే బింబిసారునకు శాంతి చేకూరింది. తక్షణం అతడు అక్కడి నుండి లేచి నిల్చి ప్రణామం చేసి వెళ్ళిపోయాడు. శాక్యమునికి ఇప్పుడు అంగరక్షకుడులా ఉన్న ఆనందుడు విస్మితుడై దూరం నుండి చక్రవర్తి ఈ విచిత్ర వ్యవహారాన్ని చూస్తున్నాడు.

బింబిసారుడు వెళ్ళగానే శాక్యముని భిక్షువులను తన దగ్గరకు పిలిచాడు. వాళ్ళు వచ్చిన తరువాత వాళ్ళని నేల మీద కూర్చోమని ఆజ్ఞాపించి అన్నాడు— "భిక్షుకులారా, కేవలం వర్షావాసంలోనే సంఘం నాలుగు నెలలవరకూ ఒక్కచోట ఉండాలన్నది సంఘ నియమం, అయినా, ఏవడైనా రాజో, మహారాజో సంఘాన్ని మరికొంత కాలం ఉంచగోరితే ఉండడం పాపంకాదు. కారణం, సంఘం రాజ కోరికను మన్నించాలి. నేడు మనం ప్రయాణం చెయ్యం. కొన్ని రోజులు ఇక్కడే ఆగుదాం......"[1] ఇలా అని శాక్యముని ఆ పియజ్జహుని[2] వైపు చూశాడు. పియజ్జహుడు భిక్షుకుడవడానికి ముందు ఒక భీకర లిచ్ఛవీయుడు. అతడు స్వజనులను, మిత్రులను చంపడానికి కూడా సంకోచించేవాడు కాదు. అతన్ని ఉద్దేశించి శాక్యముని అన్నాడు— "పియజ్జహా, విను. నేను ఒక గృహస్థుతో ఏం చెప్పానో దాన్ని నీవు మళ్ళా విను. భిక్షుకులారా, భ్రమణం చేయడంవల్ల సాంగత్యం, సాంగత్యం వల్ల స్నేహం, స్నేహంవల్ల శాశ్వత దుఃఖం ఉత్పన్నమవుతాయి. కాబట్టి స్నేహాన్నే దుఃఖానికి[3] మూలం అని తెలుసుకోండి. వరాహానికి ముక్కుమీద శృంగం ఉన్నట్లు ప్రపంచంలో నీ ఒక్కడవే సంచరించాలి.[4]

ఈ ఉపదేశాన్నే శాక్యముని సంధ్యాసమయంలో బింబిసారునకు కూడాచేశాడు.

సరిగా ఆరు మాసాల తరువాత బింబిసారుడు ఆ అశ్వత్థ వృక్షం క్రిందనే కూర్చున్నాడు. అక్కడి సమయంలో శాక్యముని గౌతమబుద్ధుడు కాని అతని సంఘం కాని— ఎవ్వరూ లేరు. కృష్ణపక్షపు అర్ధరాత్రి. దూరాన్ని మండుతున్న కాగడా వెలుగు ఆ అంధకారంలో గాంభీర్యాన్ని ఉత్పన్నం చేస్తోంది. బింబిసారుడు మదిరోన్మాదంలో అలపి వదరుతున్నాడు— 'శాక్యమునీ స్నేహం సంసర్గంవల్ల ఉత్పన్నంకాదు, మూఢత్వం వల్ల జన్మిస్తుంది. స్నేహం స్త్రీ రూపంలో ఉన్న హాలాహలం నుండి ఉత్పన్నమవుతుంది. దీని ఫలమెంత విషపూరితంగా ఉంటుందో అడగడానికి నా దగ్గరకురా. నేనొక పుత్రునికి జనకునయ్యానని రేవా చెప్తోంది. వాహో మునీ, నీ ఉపదేశాన్ని మార్చుకో, సాంగత్యం వల్ల స్నేహం ఉత్పన్నం కాదు ... స్నేహం విషం నుండి పుడుతుంది. ఆ స్నేహానికి అంతిమ పరిణామం....."

'మహారాజా' అను ఎవరిదో మందమైన కంఠస్వరం వినిపించింది.

'ఎవరు, సంజయుడా?' బింబిసారుడు నిషాలో శిరం ఒక వైపు తిప్పి అన్నాడు— 'కృష్ణపక్షంలో కూడా నీడలాగ నా వెంటనే వచ్చేశావా?.... నీకు నిద్రరాదా?.. నీకు నీ పిల్లలతోనూ, భార్యతోనూ తియ్యని మాటలాడి సమయం వెళ్ళబుచ్చడం తెలియదా? దుష్టుడా, ఎనిమిది జాములూ నా వెంటే ఉంటే నీవుకూడా నీ మనుష్యత్వాన్ని పోగొట్టుకుంటావు.'

'రాజా, మానుషత్వాని కింత తిరస్కారం నేను చూడలేను.'

'సంజయా.'

'దేవా, ఒక స్త్రీకై సాటిలేని ఈ శక్తి నష్టమవడం నేను చూడలేను. మీరు మాగధీయుల ప్రాణం. మీరు మావారు. మావారై కూడా, మీరొక స్త్రీ వెంట బడి మీ సర్వస్వాన్ని మరచి నిరుత్సకులు, నిష్క్రియులు అవుతూన్నప్పుడు మేం చూడలేం. మీ యీ పని లేమికి శత్రువులు ప్రసన్నులవుతున్నారు. మగధరాజ దౌర్బల్యం అతని విజయలాలసను ఉత్తేజితం చేస్తోంది. అతడు మగధను కబళించడానికి అనుకూల సమయానికై ఎదురు చూస్తున్నాడు..'

ఈ మాటలు బింబిసారుణ్ణి కొరడాతో కొట్టి మత్తు నుండి మేల్కొల్పి నట్లు ఉన్నాయి. ఆర్ద్రుడైన సంజయుని వైపు అతడు రెప్ప వాల్చకుండా చూడసాగాడు. మరుగు పడిన అగ్ని, గాలి దెబ్బ తిని మండి పడ్డట్లు బింబిసారుడు కళ్ళు ప్రజ్వలించాయి, అతడన్నాడు —'సంజయా విషయం ఇంత వరకు వచ్చిందా?'

'అవును, మహారాజా.'

'అయితే, సూర్య చంద్రులను పట్టడానికి యత్నించే వాళ్ళని మేము ఉన్మత్తులని తలుస్తామనీ, వాళ్ళకుపచారం చెయ్యడానికి శస్త్రాస్త్రాలే కాకుండా రాజ వైద్యుడు కుమార భృత్యుడు కూడా ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటాడనీ, గూఢచారులనో, రాజదూతనో పంపి ఆ శత్రువులకు చెప్పించు... సంజయా, నాకు సావధానం కలిగించడానికే ఇదంతా చేస్తున్నావా?..... విషయం ఇదే అయితే విను. నేను నా తెలివిని ఎప్పుడు కోల్పోయాను? నేను లిచ్ఛవీయులను విడిచి పెట్టను. వాళ్ళని వంచి వేస్తాను. ఏడ్పిస్తాను. వాళ్ళ శిరస్సు నీ పాదాలతో తొక్కిస్తాను. అప్పుడే నాకు శాంతి కలుగుతుంది. సంజయా, లిచ్ఛవీయులు నీచులు, క్రూరులు, హంతకులు... విషప్రవర్తకులు.

'మహారాజా, మహలునకు బయలుదేరుదామా?'

సంజయుడు ప్రసంగం మార్చడం వల్ల బింబిసారుడు పూర్తిగా శాంతించాడు. సంజయుని భుజాల సహాయంతో అతడు రథంవైపు నడవసాగాడు. కోపం, అసూయ అవమానాల మానసిక పరితాపకారణం వల్ల అతడు అలసి పోయాడు.

ఆ సమయంలో పాలి స్థితి అతని స్థితికి విపరీతంగా ఉంది. బింబిసారుడు ఆహత హృదయంతో పాలిని స్మరించి మాత్సర్య పూరితుడవు తున్నాడు. పాలి గంభీర ప్రణయంతో అతన్ని గురించి ఆలోచిస్తూండేది. పుత్రుడు కలిగిన కారణంచేత వైశాలిలో మరింత గడబిడ వ్యాపిస్తుందనే భయంచేత పాలి ఎక్కువగా నందిగ్రామంలోనే నివసించసాగింది. ఒకనాడు రహస్యంగా రేవా ఆమెను కలుసుకోడానికి వచ్చింది. పాలి కుమారుని చూచి ఆమె మనసు వికసించింది. ఆమె రాజగృహానికి వెళ్ళాక ఒక్క క్షణంకూడా ఆలస్యం చెయ్యక సంజయుని కీ విషయం చెప్పివేసింది. కాని సంయోగవశంచేత బింబిసారుడు వారిద్దరి మాటలూ విన్నాడు.

---

1. వినయపిటకం, 2. థేరగాథ.

3. జన్మ మెత్తడం దుఃఖం, జన్మమెత్తి మరణించడం దుఃఖం. అనంత జన్మాల గణన కూడా దుఃఖమే. జన్మ—మరణ శృంఖలపుటంతాన్ని ప్రదర్శించు ఆర్య అష్టాంగ మార్గం— అనగా నిర్వాణం బౌద్ధ ధర్మంలోని నాలుగు ఉత్తమ సత్యాలలో ప్రథమ సత్యం.

4. సుత్తనిపాతం.

పాలినిగూర్చి మరచిన అనూయారబ్ధింవు వేగంతో ప్రజ్వలితమైంది. పాలిని గురించిన మృదుస్మృతులు కటువయ్యాయి. తరవాత బింబిసారుడు ఉన్మత్తునిలాగ ఉండసాగాడు. మదిరా పరిమాణం చాలా హెచ్చింది. రేవా కీ ఘటనవల్ల పశ్చాత్తాపం కలిగింది. కాని పాప మామె ఏం చేయుగలదు? పంజయుడు బింబిసారుని అస్థిరచిత్తాన్ని స్థిరంగా చేసే ప్రయత్నం మళ్లీ ఆరంభించాడు... ఈవిధంగా రోజులు గడవసాగాయి.

ఇప్పుడు పాలి ప్రశంసకుల సంఖ్య అనంఖ్యాకాన్నిమించి అకల్పమయింది ఉత్తరకురు, పాంచాల, దక్షిణాపథం, భృగుకచ్ఛం, పట్టన, తామ్రలిపి, పశ్చిమప్రదేశం, గాంధారం, కోసలం, చంపా, వింధ్య, హిమప్రదేశం మొదలైన ఎన్నో దేశాలనుండి అనేకమంది రాజులు, శ్రేష్ఠులు, మంత్రిగణం ఆమ్రపాలి ప్రాసాదానికి ఆమెను పిలుచుకొనిపోడానికి వచ్చారు. వాళ్లతోబాటు వైశాలిలోని ప్రతి లిచ్ఛవీయ యువకుడూ అందరికంటె ముందుగా పాలి కృపాకటాక్షాన్ని పొందడానికి విహ్వాలుడవుతున్నాడు.

కాని అభయరాజు మృత్యువు పాలిలో అద్భుత పరిణామాన్ని తీసుకువచ్చింది. ఆమె పురుషుని భయంకర పాశవికరూపాన్ని చూసింది. ఆమెకోసం ప్రాణం అర్పించు మూర్ఖబృందం ఆమె ఎదుట ఇప్పుడు చేతులు కట్టుకొని కూర్చుంటుంది. వాళ్లం దరినీ ఆమె నిజంగా మూర్ఖులనూ, నిరపేక్షలనూ చేసింది. పుత్రుని నిష్కళంక మైనముఖం ఆమెను ఎన్నో విషయాలనుండి ఆపుతోంది. తీరికసమయంలో ఆమెపుత్రుని హృదయానికి హత్తుకొని బింబిసారుని స్మరిస్తూ తన్నుతాను మరుస్తూ కూర్చుంటుంది. ఆమె తాత అభిరాముడు, ఆనందుడు జ్ఞాపకాని కొచ్చారు. వేదాంతీ, అప్పటి పందీ గ్రామం స్మరణకొచ్చాయి. కాని పుత్రుణ్ణి చూసి కొంతసేపు ఆమె అంతా మరచి పోయింది మాతృత్వం దానికి దృఢమైన ఆధారం. పుత్రుని నిర్దోషమైన ముఖం ఆమె నిరాశనూ, దుఃఖాన్ని దూరం చెయ్యసాగింది. వియోగంలోనూ, దుఃఖంలోనూ కూడా ఆమెకు ఆశ, తృప్తితోకూడిన భావానుభూతి కలగసాగింది.

ఒకనాటి ఉదయం ఒక దాసి పరుగెడుతూ వచ్చి 'భద్ర యెక్కడికోపోయింది' అని చెప్పసాగింది. ఈ విదంగా పాలికి మిగిలిన స్నేహబంధంకూడా తెగిపోయింది.

(సశేషం)

వైజ్ఞానిక గాథావళి-76

# పంచీకరణ గాథ




-డాక్టర్-

అగ్ని గాలి భూమీ నీరూ అన్నవి సర్వసృష్టికీ మూలభూతములని గ్రీకు తాత్త్వికులు నమ్మేరు. భారతీయుల లెక్కలో ఇవి—ఆకాశాన్నికూడా చేర్చుకుని—'పృథివ్యాపస్తేజో వాయురాకాశాత్' అని ఐదయినాయి పృథివికి గంధమూ, నీటికి రుచీ, వాయువుకి స్పర్శా, తేజస్సుకి రూపమూ లక్షణా లన్నారు. ద్రవాలకూ వాయువుకూ కూడా గంధ గుణమున్నది. నీటికేకాక ఘనపదార్థానికీ, నీటిలో కరిగిన వాయుపదార్థానికీ రుచి వున్నది. స్పర్శగుణము ఘన—ద్రవ పదార్థాలకూ గలదు. తేజస్సుకు స్వత స్సిద్ధంగా రూపములేదుగాని తేజస్సువల్ల ఒకవస్తువు రూపము తెలుస్తుంది. ఇక శబ్దమొక్కటి మిగిలి పోయింది. శబ్దము గాలిలో వ్యాపిస్తుంది. ద్రవాల లోనూ ఘనపదార్థాలలోనూ కూడా వ్యాపిస్తుంది. గోదావరిలాంటి నదులలో స్నానానికి మునిగినప్పుడు మూడు నాలుగు మైళ్ల దూరానవున్న మోటారు లాంచి నీటి చక్రపు చప్పుడు (గాలిలోంచి వినరాదు గాని) నీటిలో మునిగినవారికి వినబడుతుంది. రైలు వెళ్లిపోయినతర్వాత పట్టాపీద చెవిపెట్టితే దూరాన్న పోయే రైలు చక్రాలు పట్టాల కాలిని దాటిన టక్కు టకా చప్పుడు వినబడుతుంది. మనవారు, శబ్దమన్నది ఆకాశంలో వ్యాపిస్తుందనే అనుకున్నారు కాని గాలిలో, నీటిలో, గడ్డలో వ్యాపిస్తుందని గుర్తించినట్లు కానరాదు కనుకనే 'శబ్ద గుణక మాకాశమ్' అన్నారు శబ్దము పదార్థాలలోనే కాని పట్టి ఆకాశములో వ్యాపించనే వ్యాపించదు. ఆకాశము శబ్దగుణకము కానేకాదు. గాలి ఆకాశంలో లేదా అంటే, తక్కినవన్నీ ఆకాశంలోనివేకదా?

సృష్టిని పంచభూతాలుగా వర్గీకరించి, మళ్లీ పంచీకరణము అన్న పద్ధతిలో ఈ పంచభూతాలనూ భాగాలుచేసి కలిపేరు మనవారు ఈ కలపడము మహావిచిత్రము. అసల్కు పంచభూతాలన్నీ కంటికి కానరాక అతిసూక్ష్మంగా వుంటాయుట. అలాగ సూక్ష్మంగావున్న అయిదూ ఒక్కొక్కటి రెండు సమభాగాలైనదట. ఇలాగ సగమైన రెండు భాగాల్లో ఒక సగము నాలుగు భాగాలైనదట ఈ చిన్న భాగాలు ఒక్కొక్కటి అసలులో ఎనిమిదో భాగమైన దన్నమాట ఇప్పుడు అసలు గాలిలో సగభాగానికి తక్కిన నాలుగింటా ఎనిమిదో భాగాల్ని (ఒక్కొక్కటి చొప్పున) కలిశాయుట ఒకదానిసగము పకు, తక్కిన నాటి ఎనిమిదో భాగాలు నాలుగుచేరి ఏర్పడిన కలగాపులగపు—సగము, చేరి మొత్తము నిండు ఒకట్లైఅయి, ఇప్పుడు మనము చూసే పృథివ్యాపస్తేజోవాయురాకాశాలుగా ఏర్పడ్డాయుట మొత్తానికి తేలినదేమిటి, "ప్రతి భూతములోనూ సగమే దాని భాగమున్నా మిగిలిన సగములో తక్కిన నాలుగు భూతాల ఎనిమిదో భాగాలు నాలుగున్నూ చేరివున్నాయని పంచీకరణకారుల అభిప్రాయము' అన్నమాట. అయితే కంటికి కానరానిరూపాలు పంచతన్మాత్రలనీ, అవి విభజించబడి కూర్చబడి చేయబడ్డవి స్థూలంగా కనబడే ఈ పంచభూతా లని ఎందుకు అనివుంటారూ? కంటికి కానరాని అదృశ్యమాత్రలను విభజించి కూర్చిన వాటికి (మహా) స్థూలరూపము ఏర్పడిందా? పంచభూతాలే ఏర్పడ్డాయి అనేయకుండా ముందు పంచతన్మాత్రలనూ తరవాతనే పంచభూతాలను ఎందుకు చెప్పి వుండవచ్చునూ?

పంచభూతాలలో ప్రతి ఒకరాదానిలోనూ తక్కిన వాటి గుణాలు కొంతవరకూ కనబడుతున్నాయి ఒకటి. ఈ పంచభూతాలూ బృహద్వ్యాప్తి గలిగినట్టివి, వీటి సమ్మేళనమే సర్వ జగత్తూ అన్నది రెండూ. ఈ రెండు అభిప్రాయాలూ పరిశీలిస్తే, కొంత జవాబు రావచ్చును పై ప్రశ్నకు 'ప్రతిభూతమూ ఇతర గుణాలను గర్భీకృతము చేసుకుని, తనలోనున్న ఆ యీ (స్థగిత) భేదములలోనే సృష్టించబడింది అనడముకంటె ("పంచభూతాల ప్రాణాలు") గంత తన్మాత్రలు ముందు సృష్టి అయినాయీ, ఆ ప్రాణాల సమ్మేళనములో అనుసరించబడిన పంచీకరణ ప్రక్రియలో భూత గుణ మేళనము జరిగింది, అలాగ ఏర్పడ్డ సంయోగాలు భిన్నాంకభేదాలు లేకుండా పూర్తి (1 గదూ అయిందీ, ½ కి నాలుగు 1/8 లు కలిపితే!) య్యినవే అయి బృహద్రూపధారణ చేసినవి" అనడము హేతువాద్యావముకాక క్రమకథనము అవుతుందని తోస్తుంది

ఇంతకూ పృథివ్యాపస్తేజోవాయు రాకాశాదుల ధర్మాలు ఏ విషయములో ఒకటి (1) అవుతున్నాయీ? ఆకాశానికి తక్కిన వాటి ధర్మాలు ఏవి గోచరించవు. తేజస్సుమాటా అంతే సృష్టి కార్యములో ఈ అయిదున్నూ సమాన భాగస్వాములే అనడము ఏ దృష్టితో చెల్లగలదూ? "ప్రతిది ఒక తత్త్వము" అనడములోమాత్రము 'ఏకత్వము' భావరూపంగా కనబడుతుంది అయితే పృథివీ, నీరూ, వాయువు అన్నవి సూటికిమించిన మూలపదార్థాలుగా విడుతున్నాయి ఇక పంచభూతాలనగా ఏవి? ఘన, ద్రవ, వాయు పదార్థాలూ, శక్తి, ఆకాశమూను అని సమన్వయించామనుకోండి. కాలము మాటో? "పృథి వ్యాపస్తేజో వాయురాకాశాత్ కాలోదిగాత్మా మనః" అంటూ పదార్థాలను 9 గా కాబోలు చెప్పేడు కణాదుడు కనక కాల ఆకాశములను రెంటినీ కలిపి కాలాకాశము (Space–Time) అన్న పేరుపెట్టి, వేరుగా దాన్ని చేర్చక, దాటుకు పోవడము కేవలమే అవుతుంది అలాగకాక కాలాకాశము ప్రత్యేకంగా ఒకటి అని గణించి, పదార్థాన్నీ, శక్తినీ చేర్చి 'శక్తిద్రవ్యమూ, కాలాకాశమూ విద్యుదయస్కాంతిక గురుత్వాకర్షణ క్షేత్రము' అని మూడింటినే చెప్పడము మరో పద్ధతిగదా? మరి విశ్వ సృష్టిక్రమాన్నే సమీపించే యత్నము, చిరకాలానుగతంగా భారతీయుల మనోపీముల లోక్కి వచ్చిన ఈ 'పంచీకరణముగదా దీనికి ఆధారమ్ము ఏది అయినట్టూ? అప్పటికి కనబడ్డ ఐదుభేదా—సులభ గణితమూనా?

సులభగణితమంటారా అంటారా? అవును పంచభూతాలు కనబడ్డా యీ పంచేంద్రియాలు కనబడ్డాయీ. పంచకర్మేంద్రియాల్నీ శబ్దస్పర్శరూపరస గంధాలనూచేర్చి, సృష్టిక్రమంలో ఐదు సంఖ్యని ఖాయం చేశారు అక్షౌహిణీ ప్రమాణము చెపుతూ మూడు పెట్టి గుణించుకుపోయారు. త్రసరేణువు నుంచి అంగుళముదాకా రావడములో 8(?) అన్న సంఖ్యకి ప్రాధాన్యము వచ్చింది జాగ్రఫీలో ఏడును స్వీకరించి సప్తకుల పర్వతాలూ, సప్తసాగరాలూ, సప్త ద్వీపాలూతో అగకపైన ఏడులోకాలూ అడుగున ఏడు లోకాలూ లెక్కవేశారు ఇవన్నీ అనుభవాన్నిబట్టి చేసిన వేనా? అవి. ●

ఇదిగో...




- కొత్త పెద్ద-సైజు నం. 1
- కొత్త ఆకర్షణీయమైన కాగితపు మోత—
- కొత్త లేత గులాబీ రంగు గల సబ్బు—
- అప్పుడే కోసిన తాజా గులాబీ సువాసన గలది—

చాలా పెద్ద-సైజు నం. 1 గోద్రెజ్ వారిది-దాదాపు ఏబది సంవత్సరముల సాంప్రదాయమైన పెద్ద కుటుంబ సబ్బు—మెచ్చుకొని అయిష్టంగా ఉపయోగించే వారికి పరిశుభ్రం ప్రీతికరంగా తయారు చేయబడిన-మనోహరమైన గులాబీ సువాసన గంది. వాడుకలో చాలా కాలం నిలవుంటుంది, చాలా ఎక్కువ నురుగునిస్తుంది. మీ సొమ్ముకు ఇటువంటి సబ్బులకంటే చాలా ఎక్కువ విలువ నిచ్చేది, నేడే నం. 1. బిళ్లను వాడి చూడండి.

**గోద్రెజ్ నం.1**

ఎన్నికొనుటలో ప్రధమం,
ఖర్చు తక్కువలో ప్రధమం

Godrej
**గోద్రెజ్**
సబ్బులలో
ఉత్తమ నామము




సుబ్బారావుకి చచ్చేంత కోపం వచ్చింది.

రాదూమరి! తన స్థానంలో ఎవరున్నా అంతకన్నా ఎక్కువ కోపమే వచ్చేది. లేకపోతే ఏమిటి మరీనూ... అంతమందిలో తనను ఇన్సల్టు చేస్తుందా . తనసలే ఆ కాలేజీలో అందరికీ బాగా తెలుసుననీ సుబ్బారావు అభిప్రాయం. అలాంటిది ఇవాళ వదిన.... ..

"హు!" అనుకొన్నాడు సుబ్బారావు అనుకోవడమేం ఖర్మమళ్ళీ పైకనేశాడు గట్టిగా.

ఇంతకూ అసలు తనే అలుసిచ్చాడు వదినకి. లేకపోతే అంత ధైర్యంఎక్కడిది. .

కాలేజీ ఎదురుగా వున్న చంద్రం బాబాయి కాఫీ హోటల్లో దూరిపోయాడు సుబ్బారావు.

"ఏరానాన్నా! ఏమిటి మొఖమలా ఈస్ట్మన్ కలర్‌లోకి మారింది? మళ్ళీ లెక్చరర్‌తో పోట్లాడావా?" అడిగాడు చంద్రం బాబాయి పొట్ట నిమురుకొంటూ.

"కాదు బాబాయి ... అంతా చెప్తాగాని ముందు బాక్కాఫీ ఇవ్వు!"

"ఒరేయ్! స్పెషల్ కాఫీ పట్రారా సుబ్బారావుకి!" అంటూ లోపలికి అరచాడు చంద్రం బాబాయి.

పి ట్ట క థ

చంద్రంబాబాయి అసలు పేరు చంద్రం మాత్రమే. 'బాబాయి' అనేది ఆ కాలేజీ కుర్రాళ్ళందరూ అతనికి అల్లారు ముద్దుగా పెట్టుకొన్న పేరు. అయిదు అడుగుల నాలు గంగుళాల పొడవూ కింగ్‌కాంగ్ బొజ్జా, అంతే శరీరం, కొద్దిగా మెలితిరిగిన మీసాలు, ముప్పైఅయిదు సంవత్సరాల వయసూ ఇదీ బాబాయి వర్ణన. అతడా కాలేజీ కుర్రాళ్ళందరికీ కల్ప తరువు లాంటివాడు అడిగితే ప్రాణం ఇవ్వక పోయినా కనీసం కాఫీ ఇస్తాడు. మరియు అతడి వద్ద అనేక మంది చదువుకొనే, మరియు చదవకనే కుర్రాళ్ళు ఖాతాదారులు. ఎవరయినా ఖాతా ఎగ్గొడితే నాలుగుతికి వసూలు చేసుకొంటాడు. కాని 'బాబాయి' అని ప్రేమగా పిల్చి అతని కింగ్‌కాంగ్ బొజ్జమీద చెయ్యివేసి నిమిరితే, ఆ తరువాత ఖాతా ఎగ్గొట్టినా ఏమీ అనడు. అనుకోడు. ఈ కిటుకు తెలిసే, సత్యంగాడు, శంకరంగాడు, రాధాగాడు మళ్ళీ మన కథలో సుబ్బారావు అందరూ కాఫీ త్రాగే ముందు ఎప్పుడూ 'బాబాయి' అని పిలిచి, కాఫీ త్రాగి తరవాత మళ్ళీ 'బాబాయి' అనేసి వెళ్ళిపోతూంటారు. ఈ సుబ్బారావనే బి.ఏ. సెకండ్ ఇయర్ కుర్రాడు ఎప్పుడూ (కాలేజీ టైములో కూడా) తన హోటలులోనే వుండటం మూలానా, కాఫీ అక్కర లేకపోయినా కూడా 'బాబాయి' అని పిలుస్తూండటం చేతా ఇద్దరికీ స్నేహం ఎక్కువయిపోయి, గాఢ స్నేహంగా మారింది.

"ఇంతకూ జరిగిందేమిటి గురో!" సుబ్బారావుకో కాఫీ ఇచ్చి తనో కాఫీ తెచ్చుకొన్నాడు చంద్రం బాబాయి

"అదికాదు బాబాయి! వదిన అవుతే అవ్వొచ్చుగాక! ఇంట్లో వదినతనం చూపించాలి. అంతేగాని కాలేజీలో కూడా ఇంట్లోలా డబాయించేస్తుంటే... నా పరువు దెబ్బతినడంలా?" రెండుగుక్కల కాఫీ త్రాగి అడిగాడు సుబ్బారావు .

"వదినమ్మతో గొడవా!" అన్నాడు చంద్రం బాబాయి చప్పరించేస్తూ.

"చెప్పేది విను బాబాయ్! నిజమే! నిన్న లాస్టు అవర్— వదిన క్లాసే అనుకో,

విగ్గొట్టేసి క్లియోపాత్ర పాట్నేకి వెళ్ళే శాను... పోనీ ఆ సంగతి ఇంట్లో అడగొచ్చుగా... విన్నేమీ అడగలేదు. ఇవాళ మళ్లీ సెకండ్ అవర్ ఇంగ్లీషు కొచ్చి నప్పుడు "మిస్టర్ సుబ్రావ్! నిన్న మధ్యాహ్నం మీరు ఫస్టవర్ ప్రజెంట్. కాని లాస్ట్ వరులో క్లాసులో లేరు. కారణం?" అనడిగేశింది అంతమందిలో. పైగా క్లాసులో మన సురేఖా, సతి అరుంధతీ, రెడ్ రోజా, పిమిడిముక్కూ చింతపువ్వులూ... ఈ అమ్మాయి లందరూ క్లాసులో వున్నారాయె... అదే ఇంకో లెక్చరరయితే "దటీస్ అనెసెసరీ టు యూ!" అనే వాళ్లే. కాని....

అక్కడికీ "తలనొప్పిగా వుండి వెళ్లి పోయాను మేడమ్!" అని జవాబిచ్చాను వూరు కొంటేనా?

"తలనొప్పి ఉంటే డాక్టర్ని చూడాలి కాని క్లియోపాత్రని చూస్తే తగ్గుతుందా?" అనడిగేశింది.

"సారీ! మేడమ్! నేను పిక్చర్ కెళ్ల లేదు!" అని కోశాను గ్రహించుకొంటు దేమోనని.

కాని వినిపించు కొంటేనా. "ఇదిగో ఈ టికెట్టు ముక్క మీ ఇంగ్లీషు ప్రోజ టెక్స్టులో కెందు కొచ్చింది? అంటూ వో టికెట్ చూపించింది. క్లాసంతా ఘొల్లు మన్నారు. ఆ చింత పువ్వులు మరీనూ, వెక్కి వెక్కి ఏడ్చి నట్లు నవ్వింది దాని పని తర్వాత చెప్తాలే....

సరే అయిందా మాట్లాడకుండా కూర్చున్నాను.

అక్కడితో వదలక 'పారడైజు లాస్ట్'లో ఏదో కొశ్చన్స్.... నాకసలే ఆ పుస్తక మంటే తప్పేమంట అని నీకు తెలుసు గద బాబాయి.

ఏమీ చెప్పకుండా వూరుకొన్నాను. చింతపువ్వులు మళ్లీ కసుక్కుమని నవ్వింది. దాంతో మళ్లీ క్లాసంతా ఘొల్లు మంది. ఛా! డామ్ ఇన్సల్ట్ బాబాయి" కాఫీ పూర్తి చేశాడు సుబ్బారావు.

కాసేపాగి అన్నాడు మళ్లీ "ఈవిడ సంగతేమిటో .. ఇవాళ ఇంటి దగ్గర తేల్చేస్తాను. అన్నయ్యతో చెప్పేస్తాను. ఆవిడ నా మీద డబాయించటం బావుండ లేదని..."

"అప్పుడు మరి నువ్వు పాట్నేకి వెళ్ళేసిన సంగతి ఇంట్లో తెలిసిపోతుంది గదా?"

"ఈ ఒక్కసారికి తెలిసినా సరే! వస్తాను బాబాయి... సాయంత్రం బజారులో కలుస్తాను. ఈ కాఫీ డబ్బులు రేపిస్తాను...." అనేసి వెళ్లిపోయాడు సుబ్బారావు.

సరాసరి ఇంటికి చేరుకున్నాడు.

"అమ్మా ఆకలేస్తోందే! ఏమయినా టిఫిన్ చేశావంటే?" అన్నాడు గారాముగా.

"ఒక్క అరగంట ఆగు నాయినా! వదిన కాలేజీ నుంచి ఇప్పుడే వచ్చింది. ఉప్మా చేస్తుందిట!"

వదిన పేరు వినగానే సుబ్బారావుకి మళ్లీ ఇందాకటి కోపం వచ్చేసింది.

"వదినెందుకే అమ్మా! నువ్వు వెయ్యరాదా! ఎప్పుడూ వదినా వదినా... అనక పోతే. ఇన్నాళ్లూ ఆవిడే చేసిందేమిటి మనకి!" కోప్పడ్డాడు సుబ్బారావు

"ఏమో బాబూ, మీ వదిన వచ్చిం దగ్గర్నుంచీ నేను వంటింట్లోకే పోవడం లేదు. ఎక్కడ ఏ వస్తువుందో దానికే తెలియాలి!"

"పో! అమ్మా నువ్వు మరీనూ!" అనేసి స్టైలుగా "పోనీ! వో అయిదు రూపాయి" లుంటే ఇవ్వమ్మా, మళ్లీ ఆదివారం నాడు నీ కిచ్చేస్తాను"

"ఆదివారంనాడు జీతం వస్తుంది కాబోలు నీకు!" నవ్విందావిడ.

"చదువనీ వమ్మా! నెల నెల జీతం అంతా నీకే తెచ్చిస్తాను! తొందరగా ఇవ్వు!" అన్నాడు.

"పెట్టె తాళం చేతులు వదిన దగ్గర ఉన్నాయి తీసుకురా!" అందావిడ.

మళ్లీ వదినపేరు వినేప్పటికి సుబ్బారావుకి వళ్లు మండి, తగలడి పోయాడు.

"ప్రతీదీ వదినేమిటమ్మా! మనఇల్లంతా ఏలేస్తోందే ఆవిడ! పైగా ఆవిడకి బోలెడు గర్వం కూడానే. కావాలంటే నా ఫ్రెండు శేషునడగరాదూ. క్లాసులో నన్నూరికే తిడుతోందే, సినిమాకెళ్ళక పోయినా వెళ్లానని అందరిలో తిట్టేసిందివాళ! మన ఇంట్లో వో పెద్ద హిట్లరయి పోయిందే ఆవిడ .. నీకు తెలీదు..... ....." ఆగి పోయాడు సుబ్బారావు.

వదిన ఆగదిలోకి వచ్చింది.

"చూడయ్యా! నువ్విలా మాట్లాడతావని నేనెప్పుడూ అనుకోలేదు. ఇక నుంచి నేను నిన్నేమీ అడగను నువ్వేమీ చెప్పొద్దు కూడా!" అంటూ తాళం చేతులు అత్తగారి చేతిలో వుంచి వెళ్లి పోయిందావిడ.

"చూశావా! దానికెంత పొగరుందో!" అంది తల్లి.

"బెదిరిస్తోంది అమ్మా! కోపమొస్తే మనకేం?" అన్నాడు సుబ్బారావు ఇంకొంచెం కోపం తెచ్చుకుని.

రాత్రి సుబ్బారావు బజారు నుంచి ఇంటికి తిరిగొచ్చేసరికి ఎనిమిదయింది. కాళ్లు కడుక్కొని భోజనాని కూర్చున్నాడు. రోజూ వదిన అన్నం వడ్డించేది. కాని ఆరోజు చెల్లాయి వడ్డించింది.

"వదినకి నామీద బాగా కోపంవచ్చింది!" అనుకొన్నాడు సుబ్బారావు.

"అసలు రావాలి కూడాను!"

'అలావుంటే కనీసం క్లాసులో తనని ప్రశ్నలు వేయకుండా వూరుకొంటుంది' అనుకున్నాడు సుబ్బారావు.

"ఏయ్! విమ్మీ వదినేం చేస్తుంది?"

"... ... ... ..."

"నిన్నేనే! వదినేం చేస్తుందంటే మాట్లాడవేం?"

'వదినని నువ్వేమిటో అన్నావుటగా.. కోపం వచ్చింది ... అన్నంకూడ తినలేదు'

"నేనేమన్నాను! పెద్ద తెలిసినట్లు వాగుతావు?" అన్నాడు సుబ్బారావు మళ్లీ కోపంగా.

డాబామీద కెక్కి ట్వెల్త్ నైట్ డ్రామా తీసి చదువుతున్నాడు సుబ్బారావు.

అయినా బుర్రకేమీ ఎక్కడం లేదు. నిజంగా తనేమయినా తప్పుగా అన్నాడా వదినని. వెంటనే సమర్థించు కొన్నాడు సుబ్బారావు. అబ్బే! . తనేం తప్పు మాట అనలేదు. లేకపోతే ఏమిటి! పూహూ మరీనూ అన్నయ్యకి మారేజ్ అవకముందు క్రిందటి సంవత్సరం వరకూ తనెంత సర్దాగా వుండే వాడు. స్నేహితుల్తో గొడవ చేసుకొంటూ, క్రిస్టీన్ కీలర్ సరోజని ఏడిపించుకొంటూ కాలేజీకి చేరుకునే వాడు. చంద్రం బాబాయి హోటల్లో రోజుకు ఏడెనిమిది సార్లు కాఫీ త్రాగేవాడు. ప్రతి అవర్ లోనూ అటండెన్స్ వేయించుకొని వెనుకడోర్ లో నుంచి బయటకు వచ్చేసేవాడు. బృందావన్ టాకీసులో మంచి మాంచి ఇంగ్లీషు పిక్చర్లొస్తే రాఘవగాడితో తన ఆటం

# పదినమ్ర

డెస్కు పలక మన్నిస్తి తను మాట్నీకి చెక్కేసేవాడు. తెలుగు లెక్చరరు అయోధ్య రామయ్యగారి క్లాసులో "చెల్లియో చెల్లకో" అనే పద్యం పుస్తకం అడ్డం పెట్టుకొని పాడేసేవాడు. (ఆయనకు చెవుడాయె మరీనూ)…. రాత్రుళ్ళు పదింటి వరకూ తన బాచీ వాళ్ళందరూ బాంబే హోటల్ ముందు గుమికూడి బాతాఖానీ కొట్టేవాళ్ళు. కాలేజీలో ఎవడయినా కుర్రాడు తమ కెదురు మాట్లాడ్డంగానీ, పోట్లాడటంగానీ జరుగుతే కూర్మారావు గాడినీ తీసుకుపోయి రాత్రి పదింటికి వాడిని రూములో నుంచి బయటకు పిలచి దావగొట్టి మరి వచ్చేవాళ్ళు. ఎంత సరదా రోజులవి……

ఈవిడొచ్చింది….. అంతే బంద్….

కాలేజికి ఆవిడతో పాటే పోవాలి. అన్ని క్లాసెస్‌లో వున్నది లేనిదీ తన గురించి న్యూస్ అంతా చింతపువ్వులు ద్వారా సేకరిస్తుంది. తెలుగు క్లాసులో గొడవ చేస్తే, తను ఇంగ్లీషు కొచ్చి నప్పుడు ఇన్‌డైరక్టుగా చివాట్లు, రాత్రిళ్ళు ఎనిమిది లోపలే ఇంట్లో వుండాలి. ఎనిమిది దాటితే, ఆవిడ నెక్స్టుడే క్లాసుకి ప్రిపేరవు తూంటుందట…… అందువలన మధ్యలో వచ్చి తనకి భోజనం వడ్డించడం డిస్టర్‌బెన్స్ అట…. అలాగని చెల్లాయిగాని … అమ్మగాని తనకి భోజనం వడ్డించడానికి వీలులేదుట… ప్రొద్దున్నే అయిదింటికల్లా నిద్ర లేవాలి (అంతకు ముందు తన జన్మలో అయిదింటికి నిద్ర లేవలేదు)…. కాలేజీలో లాస్టు అవర్ ఎగ్గొట్టి ఇంగ్లీషు మాట్నీలకు వెళ్ళ కూడదట… ఎవడయినా వింటే రెండు నోళ్ళతో నవ్వుతాడు. అలాంటి కుర్రా డెవరయినా వుంటే ఫొటోతో సహా వేసి ఏకిపారేస్తారు పేపర్లో…. స్టూడెంట్స్ యూనియన్ నుంచి బాయ్‌కాట్ చేసి పారేస్తారు. వెధవది..! బోలెడు మంది ఆడపిల్లలు క్లాసు ఎగ్గొట్టి వెళ్ళగా లేంది .. ఇంత మొగాడయి వుండి .. అన్నిటికంటే ముఖ్యమయిన సంగతి మరొహటుంది… తనెప్పుడు పరీక్ష వ్రాసినా కావాలని తన హాలుకే 'వాచర్'గా వేయించుకొని తన జేబులోని కాపీలన్నీ లాక్కొని బయట పారేస్తుంది…. వెధవది… ఆఖరికి కాపీలుకూడా కొట్టనీకపోతే ఇంకేమిటి! ఇంత మంది డిగ్రీలు పుచ్చుకొన్నారు ఎక్కడోచోట, ఏదో సందర్భములో కాపీకొట్టకుండా ఎవడూరు కొంటాడు? ఎవతె వూరు కొంటుందీ? అసలు కాపీలు కొట్టకపోతే ఇంక పరీక్ష లెందుకు తన తలకాయ! అసలు కాపీల్లేం దెక్కడ? అరవ సినిమాలు, తెలుగు సినిమాలు పరస్పరం కాపీ కొట్టుగొంటు న్నాయి. రెండూ కలిపి మళ్ళీ హిందీ సినిమాలని కాపీ గొడుతున్నాయి హిందీ సినిమాలు మళ్ళీ ఇంగ్లీషు సినిమాలని కాపీగొడు తున్నయి. ఇంగ్లీషు సినిమాలు మంచి నవల్స్‌ని కాపీ గొడు తున్నయి. కొన్ని విషయాల్లో ఇండియా అమెరికాని కాపీ గొడుతోంది. చంద్రుడు సూర్యుణ్ణి కాపీ గొడుతున్నాడు. ప్రక్కింటి తాలూకా ఆఫీసు గుమాస్తా భార్య జడ్జీగారి భార్యని కాపీ కొడుతోంది. చంద్రం బాబాయి కింగ్‌కాంగ్‌ని కాపీ గొడు తున్నాడు. చిన్న హోటల్‌వాళ్ళు పెద్ద హోటల్‌వాళ్ళని, వాళ్ళ కాఫీ టేస్టుని కాపీ గొడుతున్నారు. అప్పుడప్పుడూ పగలు రాత్రిని కాపీ గొడుతుంది. పతివ్రతలు సతీ అనసూయని కాపీ కొడుతున్నారు. కాలేజీ అమ్మాయిలు ఎలిజబెత్ టేలర్‌ని కాపీ కొడుతున్నారు. కాలేజీ కుర్రాళ్ళు యూల్‌బ్రిన్నర్‌ని కాపీ కొడుతున్నారు (ఒకే దెబ్బకి రెండు పిట్టలు. తిరుపతి మొక్కు కూడా తీరిపోతోంది!) అంతెందుకూ ఈ లెక్చరర్లందరూ కాపీకొట్టకుండానే ఎం. ఏ. పాసయేరా? ఇంకా చాలా అనుకొన్నాడు సుబ్బారావు. అనుకొంటూంటే పదిన మీద కోపం పరీక్షల్లో కాపీ పెరిగి నట్లు పెరిగి పోతోంది. రాత్రి పన్నెండయి పోయింది.

పన్నెండోసారి ట్వెల్త్‌నైట్ డ్రామా బుక్కు అతని చేతుల్లోంచి జారి గుండెల మీద పడిపోయింది. అతనెప్పుడు నిద్ర పోయాడో అతనికే తెలీదు. తల దగ్గర ఎలక్ట్రిక్ బల్బు ప్రొద్దున్న ఎనిమి దింటి వరకూ వెలుగుతూనే వుంది. అతను మళ్ళీ కళ్ళు తెరచేసరికి ఎనిమిదిన్నర అయిపోయింది. ఎండ మీద పడుతోంది. ఆశ్చర్యంగా వుందతనికి రోజూ నిద్ర లేచేసరికి వెధవది చీకటిగా వుండేది. ఎంత కాలానికి హాయిగా నిద్రపోయాడు తను. అసలు నిద్రేగదా మనిషికి బలం.

అనుకొన్నాడు సుబ్బారావు. అట్లాయితే ఇవాళ ప్రొద్దున్న అయిదింటికి వదిన తనని లేపలేదన్నమాట. ఇక నుంచి తను ఇదివరలా.... హాంకు! ఎంచక్కా! అనుకున్నాడు.

టూత్‌పేస్టు బ్రష్ రోజూ బాత్‌రూమ్‌లో వుండేవి రడీగా. కాని ఇవాళ లేవు మరి... ఫరవాలేదులే అనుకున్నాడు సుబ్బారావు. వాటికోసం పది నిమషాలు వెతుక్కున్నాడు. చివరకి వో అలమారలో దొరకినయి. స్నానం చెయ్యడానికి రోజూలా వేణ్ణీలు లేవు బకెట్‌లో... ఒక వేళ తను వెళ్లి ఆమెని బ్రతిమాలతాడనుకుందేమో! చస్తే మాలడు! ఒళ్లు మండి సుబ్బారావు చన్నీళ్ళ స్నానం చేశాడు అప్పటికే తొమ్మిదిన్నర అయిపోయింది. చెల్లాయి బడికి వెళ్లిపోయింది వదిన కూడా రడీ అయిపోయింది కాలేజీకి బయల్దేరడానికి. అమ్మేమో మొక్కలకు పాదులుచేస్తోంది. మరి తనకి కాఫీ టిఫిన్ ఎవరిస్తారు.

ఇంటిముందు రిక్షా ఆగింది. ఆమె ఒక్కర్తే కాలేజీకి వెళ్లిపోతుందన్నమాట. ఆమె ముఖం చాలా సీరియస్‌గా వుంది ఇవాళ అనుకున్నాడు సుబ్బారావు. "పోనీ! తనకేం భయమా! చంద్రం బాబాయి హోటలు వుండనే వుంది" అనుకొని వెంటనే బట్టలు వేసుకుని త్వరత్వరగా నడువ సాగాడు. కాస్త దూరం నడిచేసరికి కళ్లు తిరిగినయి సుబ్బారావుకి ప్రొద్దున్నే కాఫీ త్రాగటం అలవాటాయె ఏడ్చి.... అనుకొన్నాడు. బాబాయి హోటల్లో కాఫీ టిఫిన్ పూర్తయేసరికి ఫస్టవరు కమెన్స్ అయి పదినిమషాలయి పోయింది.

ఫస్టవరు ! ఇంగ్లీషు .. వదినే....

అసలే తనంటే కోపంగా వుంది. "డోన్ట్ కమ్‌టు మై క్లాస్. యు ఆర్ లేట్" అంటుందేమో. అంటుందేమో. ఏమిటి ఖచ్చితంగా అంటుంది. అననీ "దట్సాల్ రైట్" అని తిరిగి వచ్చేస్తే సరి అంతేగాని చస్తే రిక్వెస్ట్ చెయ్యకూడదు .. గడప దగ్గర నుంచున్నాడు సుబ్బారావు క్లాసు అందరి కళ్ళూ తన మీదకి తిరిగినయి వదిన తనని చూడలేదు . అటు తిరిగి నుంచుని చెబుతోంది ! .. ఎలాగో తనని క్లాసు లోనికి రానివ్వదు. నెక్స్ట్ క్లాసు నుంచి ఆమెను బాగా ఏడిపించేయాలి పిల్లి కూతలు వేసెయ్యాలి. తన బ్యాచీ వాళ్ళం

దరితో హోరున గొడవ చేయించెయ్యాలి. కాగితం "యారోప్" విసిరెయ్యాలి.....

"కమిన్....." వదిన గొంతు...

తనకు తెలియకుండానే లోపలికి నడిచాడు సుబ్బారావు. ఆఖరు బెంచీలో కూర్చున్నాడు. అంతా తారుమారయిందే అనుకొన్నాడు. తన నేమీ ప్రశ్నించలేదు కూడాను!

సాయంత్రం కాలేజీ అయిపోయిన తరువాత ఆమె రూలు ప్రకారం సుబ్బా రావు ఆమె వచ్చేవరకూ ఆగి ఆమెతో కలిసి ఇంటికి వెళ్ళాలి. కాని ఇవాళ సుబ్బారావు ఆమె కోసం ఆగదల్చుకో లేదు. కానీ అనుకోకుండానే స్టాఫ్‌రూమ్ దగ్గర కొచ్చేసరికి ఆగి పోయాడు. వది నమ్మ వచ్చి అతనిని కలుసుకొంది. ఇద్దరూ నడక సాగించారు. సుబ్బారావు ఆమెకు వెనుకగా నడుస్తున్నాడు. ఆమె ఏమయినా మాట్లాడుతుందేమో అనుకొన్నాడు కాని ఆమె ఏమీ మాట్లాడలేదు. ఏమయినా సరే తనూ మాట్లాడ గూడదని నిర్ణ యించుకొన్నాడు. నాలుగు రోడ్ల సెంటర్ కొచ్చేసరికి జిల్లా కోర్టు రోడ్ నుంచి అన్నయ్య సైకిల్ మీద రావటం గమ నించాడు సుబ్బారావు.... నల్లకోటూ అదీ అచ్చు సినిమాలో లాయర్లా వున్నా డనుకొన్నాడు సుబ్బారావు.

"హలో!" అన్నాడు వెంకటేశ్వర్రావు సైకిల్ దిగుతూ.

"ఏం ఇవాళ 'కోర్టు'కి పెందలాడే డైవర్స్ ఇచ్చారు?" అంది విమల నవ్వుతూ.

## వదినమ్మ

ముగ్గురూ నడువసాగారు. సుబ్బారావు తలవంచుకొని నడుస్తున్నాడు. ఒక్క మాటగూడా మాట్లాడ లేదు.

"ఏమిటి? ఇద్దరూ బద్ధ విరోధుల్లా నడుస్తున్నారు ఇవాళ!" అడిగాడు వెంక టేశ్వర్రావు.

అతనికేం జవాబు రాలేదు.

"ఏం విమ్మా! ఏమిటి విశేషం? వాడలా షేక్స్‌పియర్ మొహంపెట్టాడేం?"

"మీ తమ్ముడుగారిప్పుడు ఇది వరలా కాదు. ఆయన చాలా పెద్దవారయి పోయారు. ఆయన్ని శాసించే హక్కు మనిద్దరిలో ఎవరికీ లేదు!"

"ఈజ్ ఇట్? ఏమండీ సుబ్బారావు గారూ! అవన్నీ నిజమేనుటూ?"

"ఆయన్నడిగే అవసరం లేదు. దటీజ్ వాట్ హి ఈజ్ ఫీలింగ్.... మన మంటే ఇష్టం లేనిచోట మన ముండటం కూడా నాకేం బావుండలేదు ... రేపే వేరే ఇల్లు చూడండి వెళ్లిపోదాం!" అనేసింది విమల.

సుబ్బారావుకి కొద్దిగా షాక్ తగిలి నట్లయింది. వదిన ఈ విషయాన్ని చాలా సీరియస్‌గా తీసుకొందన్నమాట. అసలు అటువంటి డెసిషన్ తీసుకో వల్సినంత తప్పు తనేం చేశాడో అతని కర్థం కాలేదు. తనామెని అనరాని మాట లేమీ అనలేదు. పోనీ అనవచ్చినమాటలూ అనలేదు. జరుగుతున్న సంగతి పైకన్నాడు. అదే తప్పయితే.... ఇహను... ఇండియాలో తప్పు కాందేది?

ఆ రాత్రి సుబ్బారావు డాబా మీద కెక్కుతూంటే గదిలో నుంచి వదిన గొంతు వినిపించింది.

"ఏమయినా సరే! నాకిక్కడుండటం ఇష్టంలేదు. రేపే వెళ్ళాలి మనం... ఈ ఒక్క విషయంలో మీరు నా మాట వినాలి.. ."

"సి యిష్టం! మరోసారి ఆలో చించుకో..!.."

ఇక వినలేదు సుబ్బారావు... డాబామీద కెళ్లి పడుకొన్నాడు. పుస్తకాలేమీ చదువ బుద్ధి కాలేదు.!. వదిన అన్నయ్య నిజంగా వెళ్లి పోతారా?

'వదిన లేపోతే ఎలా? తన తండ్రి ఆమె వచ్చిందగ్గర నుంచీ ఆమె జాగ్రత్త మూలంగా మంచి ఆరోగ్యంగా వున్నారు. అమ్మ హాయిగా విశ్రాంతి తీసుకొంటోంది. చెల్లాయి వంటింట్లోకే పోవడంలేదు.. పైకంటే మళ్లీ ఆవిడకు గర్వమేమో గాని తనను ఆమె సొంత తమ్ముణిలా చూసుకుంటోంది. అమ్మకు తెలియకుండా పాకెట్ ఎక్స్‌పెన్సెస్ కని తనకి ప్రతి నెలా ఆవిడ జీతం నుంచి ముప్పై రూపాయి లిస్తోంది తనకోసం రాత్రిళ్లు మేలుకొని స్పెషల్‌గా ఇంగ్లీషు 'ఎస్సే'లు వ్రాసిచ్చింది. నిజంగానే తనకీ మధ్య మంచి మార్కులు కూడా వస్తున్నయి....

ఒక్క మాటలో తన ఇంట్లో వారం దరూ ఆమెకు ఋణపడి వున్నారు....

తనమీద చనువుచేత క్లాసులో సర్దాగా మాట్లాడింది .. అంతమాత్రాన తొందర పడిపోడం తన అవివేకం తప్పితే మరేమీలేదు. పాపం ఆవిడ తనకోసం అంత కష్టపడుతూంటే తను వో చచ్చు వెధవలా అనేశాడు ఆమెని.

ఇక ఇప్పుడు చేయగలిగిం దొక్కటే ఆవిడని క్షమార్పణ అడగాలి. ఆమెని ఇంట్లోంచి వెళ్లనీ గూడదు...' సుబ్బా రావు కళ్ల వెంబడి నీటి చుక్కలు క్రిందకు జారినయి. పశ్చాత్తాపంతో సల సల కాగిపోయాడు.

నెక్స్టుడే క్లాసుకి నోట్సు ప్రిపేర్ చేసుకొంటున్న విమలకు కూడా కొన్ని నిమషాల పాటు సుబ్బారావు మీద ఆలో చనలు చెలరేగినయి. అతన్ని తను మరీ చిన్న కుర్రాడిలా ట్రీట్ చేస్తోంది. ప్రతి వ్యక్తి కొంతకాలం వరకే కుర్రాడిలా ఉండటానికి ఇష్టపడతాడు. ఇరవై సంవత్స



## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన

సం॥







## వదినమ్మ

రాలు దాటే సరికి అతడు కుర్రతనాన్ని వదిలేస్తాడు. కొద్దిగా పెద్దాళ్లలా ప్రవర్తించాలని చూస్తూంటారు. తమని ఇంకా కుర్రాళ్లలా జమ కట్టి ఎదుటి వాళ్లు మాట్లాడితే వాళ్లకి ఉక్రోషం వచ్చేస్తుంది. గోడచాటున సిగిరెట్టు త్రాగే కొడుకుని తండ్రి వెదకి పట్టుకొని "ఏరా! సిగిరెట్టు త్రాగు తున్నావు?" అని అడిగితే ఆ మర్నాటి నుంచి ఆ కుర్రాడికి తను సిగిరెట్టు త్రాగినప్పుడు తండ్రి చూసినా ఫరవాలేదన్న అభిప్రాయం కలుగు తుంది. కొంచెం అల్లరి కుర్రాడయితే "ఏం త్రాగుతే తప్పా!" అనికూడా అడిగేస్తాడు. అదే తండ్రి చూడనట్లు వెళ్లిపోతే ఆ కుర్రాడు మళ్లీ తండ్రికి కనబడేట్లు సిగిరెట్టు త్రాగడు. తను సుబ్బారావుని అలాగే పట్టుకొని అడిగినట్లు ప్రవర్తించింది. దాంతో అతనికి తనమీద అదో విధమయిన వ్యతిరేక భావం కలిగింది... తప్పంతా తనది... అనుకొం దావిడ.

ఆ మర్నాడు ఆమె వేరే ఇల్లుచూసుకో లేదు. అతను క్షమార్పణ అడగలేదు. కాని ఇదివరకు కంటే ఎంతో ఆత్మీయు లయి పోయారిద్దరూ.

ఏ పని చేయాలన్నా "వదినా!" అంటూ అడగందే చేయడతను.

"ఏమయ్యా! దీని కేమంటావు?" అంటూ అతని సలహా తీసుకొంటుంది ఆవిడ ప్రతిదానికీ!

ఆ తరువాత సుబ్బారావు చంద్రం బాబాయి కాఫీహోటలుకి ఒక్కడే ఎప్పుడూ వెళ్లలేదు.

"ఎప్పుడు వెళ్లాలన్నా వదిన తోడుండాలి...."

"వదినమ్మ! మంచిదిరా" అన్నాడు చంద్రం బాబాయి ఓ రోజు సుబ్బారావుతో.

"ఎందుకని?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సుబ్బారావు.

"నా పదేళ్ల సర్వీసులో ఇన్నాళ్లు ఖాతా పెట్టకుండా, ఎగ్గొట్టకుండా ఎప్పటి కప్పుడు డబ్బు లిచ్చింది వదినమ్మ ఒక్కరే!"

ఇద్దరూ ఘొల్లున నవ్వేశారు. ●

# ఫ్లూ మరియు జలుబు

# వచ్చినప్పుడు జ్ఞాపకముంచుకోండి

# అనాసిన్ పేరు!

# మీ ఇంట్లో ఎల్లప్పుడు

# అనాసిన్ యొక్క ఫ్యామిలీ ప్యాక్

# ఒకటి తప్పకుండా వుంచుకోండి.

# ఎప్పుడైనా దాని

# ఆవశ్యకత వుంటుంది.

లక్షణములు:- తల నొప్పి, జలుబులు మరియు ఫ్లూ, పంటి పోటు, వొళ్లి నొప్పి, కండరముల నొప్పి.

మోతాదు :- పెద్దవారికి 2 బిళ్లలు, పిల్లలకు 1 బిళ్ల. ఇది ఎంత సులభమైన విషయము!




## అనాసిన్

చాలా మంచిది

ఎందుకనగా అది

4 విధాల చర్యజరుపును



ASP/GM/AN-12 TEL

Registered user: GEOFFREY MANNERS & COMPANY LIMITED

# కొత్త తార రాధిక



తక్కని వర్తకి

అందం, చందం, నటన, నృత్యం—వీటి తోపాటు అదృష్టం కూడ తోడు ఉంటే ఒక సినిమాతార అయ్యేందుకూ, అయి రాణించేందుకూ ఎంతో కాలం పట్టదు పైనాటితోపాటు విద్య, వినయం కలిగిన కుమారి రాధికకు అదృష్టం కలిసిరావడం వల్ల ఇవాళ చక్కని నటిగా రూపొందు తున్నది.

హైదరాబాద్ మూవీస్‌వారి "అర్ధరాత్రి" చిత్రంద్వారా ఒక ముఖ్యభూమికలో ఆంధ్ర ప్రేక్షకులకు పరిచయం అవుతున్న కుమారి రాధిక—తనకు చలన చిత్రరంగంలో ప్రవేశం లభిస్తుందనిగాని, అందులోనూ తెలుగు రంగంలో అవకాశం వస్తుందనిగాని అసలు అనుకోలేదుట కనీసం వూహించుకోలేదుట కూడాను అందుకే యీ అమ్మాయిపట్ల అదృష్టం ఉన్నదని పేర్కొన్నది

స్థానిక ఆమింజికర్లైలోని స్వరాజ్ (బిక్ వర్క్స్) అధినేత శ్రీ కె వి మాథ్యూస్ కుమార్తె రాధిక తల్లి లిల్లీ థెరేసా తల్లి దండ్రులకు ఒక్కతే బిడ్డ కావడంవల్ల అతి గారాబంగా పెంచారు మొదటినుంచి సిరి సంపదలు ఉన్న ఉన్నత కుటుంబంలో పుట్టడంచేత—మంచి లక్షణాలు అలవడినవన్నీ రాజభోగాలు అనుభవిస్తూ పెరిగిందనీ వేరే చెప్పనక్కరలేదనుకుంటాను

రాధిక పదహారేళ్ళక్రితం కేరళలోని కొట్టాయంలో జన్మించింది బాల్యంనుంచీ నటనపట్ల ఆసక్తి, సంగీతంపట్ల విపరీతమయిన మోజూ ఉన్నవి ఈ చిన్నారి అభి



నటనపట్ల ఆసక్తి

వ్యాసం · మోహన్‌కుమార్
ఫొటోలు. ప్రభాకర్

రుచి గమనించి తలిదండ్రులు అందుకోపటనే నృత్యంలో ప్రవేశపెట్టారు గోపీకృష్ణ, హీరాలాల్, చోప్రాలవద్ద నృత్యాభ్యాసం చేసింది రాధిక ఒకపక్కనుంచి నాట్యాలు నేర్చుకుంటూనే మరోపక్కనుంచి గుడ్ షెప్పర్డ్ కాన్వెంటులో చదువుకొనసాగిస్తూ వచ్చింది ఎస్సెస్సెల్సీవరకూ చదువు కున్నది మే 5 రాధిక పుట్టిన తేదీ.

ఓరియంటల్, కథాకళి నుంచి నేటి ట్విస్ట్, షేక్‌డాన్సులవరకూ— అన్నిరకాల నృత్యాలూ చేయగలదు రాధిక పలుచోట్ల నృత్యప్రదర్శనలుయిచ్చి చక్కని నర్తకిగా పేరుగాంచింది గోపీకృష్ణ బొంబాయినుంచి వచ్చినప్పుడల్లా ఆయన దగ్గర నృత్యంలో యింకా శిక్షణ తీసుకొంటూ ఉంటుంది. నాటకరంగానుభవం కూడా కుమారి రాధికకు చెప్పుకోదగినంత ఉన్నది "అండర్ సెక్రటరీ" మొదలయిన తమిళ నాటకాల లోను, "టీ హవుస్ ఆఫ్ ది ఆగస్ట్ మూన్" ఆంగ్ల నాటకంలో పాల్గొని అనేక బహుమతులనూ, ప్రశంసలనూ అందుకున్నది.

* * *

కె యస్ గోపాలకృష్ణన్ తమిళంలో దర్శకత్వం వహించి, నిర్మించిన "చిన్నంజిర్రు ఉలగమ్" చిత్రంలో రాధిక కథానాయిక భూమిక ధరించింది ఆ చిత్రం యిటీవలే విడుదలయి ప్రదర్శింపబడుతున్నది ఇందులో ఈ అమ్మాయికి మంచి పేరు వచ్చింది. ప్రజ్ఞావంతురాలయిన – నటిగా కుమారి రాధిక—యీ చిత్రంలో గుర్తింపబడి, యిపుడు మరో రెండు తమిళ చిత్రాలలో నటించేందుకు అవకాశాలు వచ్చినవి

శ్రీమతి సావిత్రి, శివాజీ గణేశన్, ఎం జీ. ఆర్, జెమినీ గణేశ్‌ల నటన అంటే రాధికకు ఎంతో యిష్టం వారితో నటించా



ఓరియంటల్, కథకళి నృత్యాలనుంచి ట్విస్ట్- షేక్ డాన్సులవరకూ

లనే మక్కువ కూడ ఈమెకు ఎక్కువ

తనను మొదటిసారిగా తమ "అర్ధరాత్రి' చిత్రం ద్వారా తెలుగు చిత్రరంగానికి తెలుగు ప్రేక్షకులకు పరిచయం చేస్తున్న హైదరాబాద్ మూవీస్ అధినేత శ్రీ గంగాధరరావు గారికీ, దర్శకుడు శ్రీ సాంబశివరావుగారికీ తను సర్వదా కృతజ్ఞురాలినంటుంది కుమారి రాధిక.



'తెలుగువారి ఆదరాభిమానాలు కావాలి'

"తెలుగురంగంలో ముందుకు రావాలనీ, తెలుగువారి ఆదరాభిమానాలు కావాలనీకోరు కుంటున్నానండీ! అందుకు తగిన కృషి కూడ చేస్తున్నాను" అన్నది రాధిక నవ్వుతూ అర రాత్రి చిత్రంలో ఈ అమ్మాయి నటన, నాట్యాలు చక్కని ప్రమాణాల్లో ఉన్నవని రషెస్‌చూసినవారు అభిప్రాయపడుతున్నారు ఆ చిత్రం విడుదలానంతరం రాధిక భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుందని చెప్ప వచ్చు

ఐస్‌క్రీమ్, చాక్‌లెట్స్ ఉంటే ఇక తిండి అక్కరలేదు రాధికకు భోజనం అయినా మరచిపోతుందిగాని వాటినిమాత్రం విడువదు ఇంట్లో ఎప్పుడు ఖాళీగాఉన్నా స్విమ్మింగ్‌కి వెళ్లడమో, సైకిల్ తొక్కడమో, కారు డ్రైవ్ చేయడమో చేస్తుంది పుస్తకాలు కూడ బాగా చదువుతుంది స్నేహితులు వస్తే సరదాగా కబుర్లు చెబుతుంది. స్వంత బంగళా, కారు, సంపద అన్నీ ఉన్న రాధికకు—ఇక కావలసిందీ, గడించవలసిందీ 'ప్రతిభావంతురాలయిన చక్కని నటి' అన్న ఖ్యాతి ●

# దోజ్ మేగ్నిఫిషియంట్ మెన్ ఇన్ దెయిర్ ఫ్లయింగ్ మెషీన్స్

నిర్ణీత సమయానికి బయలు దేరా ల్సిన విమానం వాతావరణం అనుకూలించని కారణంగా ప్రయాణం వాయిదా పడిందన్న ప్రకటనను స్పీకర్‌లో విన్న ఎయిర్ పోర్ట్‌లోని ప్రయాణీకులంతా నిరుత్సాహంతో నీళ్ళుగారిపోయి నీర్సంగా వెనక్కి తిరిగి వెళ్తూ మనకూ రెక్కలుంటే బాగుణ్ను, తలచుకున్నప్పుడు తలచిన చోటికి ఉన్న పళంగా ఎగిరి పోవచ్చు అని అనుకోడం సహజం

అయితే ఈ తలంపు యిప్పటిదికాదు కొన్ని శతాబ్దాలుగా పక్షిలాగా గగన వీధుల్లో విహరించాలనే తలంపు మానవునికి కలుగుతూనే ఉంది అలాంటి ప్రయత్నాలూ ఆ కాలంలో జరిగినయి కొండ కొమ్ముల నుంచి రెక్కలు కట్టుకొని ఎగరాలని ప్రయత్నించిన మానవుడు అలాగే అగాధాలలో పడిపోయి అగుపించని లోకాలకే ఎగిరి పోయాడు ఇలా ఇరవయ్యో శతాబ్దం వరకూ మానవుడో ఎగరటానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫల యోజనాలై ఆకాశంలో ఎగరటమన్నది గగన కుసుమం లాగే కన్పించింది పక్షులకు మాత్రమే ఎగరటం అన్నది పరిమితమై ఉంది కానీ మానవునికి కాదనే నిర్ణయానికి వచ్చారు

కానీ ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలో మంచి పలుకుబడీ, బాగా డబ్బూ ఉన్న వార్తాపత్రికా ప్రచురణకర్త ఒకరు లండన్— పారిస్ ఆకాశయానం పోటీ ఒకదాన్ని ప్రవేశపెట్టి ఆకర్షణీయమైన, ఘనమైన బహుమానాన్ని ప్రకటించాడు దాంతో ప్రపంచం నలు మూలల నుంచీ ధైర్య వంతులంతా ముందుకు వచ్చి ఎగిరే యంత్రాల రూపకల్పన చేయుటం ప్రారంభించారు కానీ వారికి కావలసినంత సాంకేతిక సంపద సిద్ధంగా లేదు వారు తయారు చేసిన విమానాలలో వెదురు బొంగులు, కాన్వాస్, పియానో తీగె ఉపయోగించారు కానీ వారు ఉపయోగించిన వాటిలో యిప్పటికీ ఆధునిక వైమానికులు ఉపయోగిస్తున్నవి రెండేరెండు ఉన్నాయి అవే వూహ, ధైర్యాలు ఆకాశంలో ఎగరటానికి అవే ముఖ్యంగా కావాల్సినవి కూడా

పోటీ జయప్రదంగా ముగుస్తుంది లండన్ నుంచి పారిస్ చేరుకోడానికి విజేతకు 25 గంటల 11 నిముషాలు పడుతుంది ప్రపంచంలోని మొట్టమొదటి విమాన మార్గం కూడా అదే ప్రస్తుతం ఆ దూరాన్నే సూపర్‌సానిక్ జెట్స్ ఏడు నిమిషాలలో పూర్తి చేస్తాయి

ట్వెంటీయత్ సెంచరీ ఫాక్స్ వారు సమర్పించిన ఈ హాస్య ప్రధానచిత్రంలో అంతర్జాతీయ ఖ్యాతి గడించిన తారలందరూ పాల్గొనటం పెద్ద విశేషం ముఖ్య భూమికలలో హాలీవుడ్ నటుడు స్టువర్ట్



కోటిన్నర రూపాయల వ్యయంలో ప్రసిద్ధ జర్మన్ చలనచిత్ర నిర్మాత నిర్మించుతున్న భయంకర మహానాగాన్ని వధించిన స్క్రైఫెడ్‌తో కథానాయకుడు, ప్రసిద్ధ ఒలింపిక్ క్రీడాకారుడు 'యూ బేయర్' (రాడ్—యు పి ఎస్)

## ...ఫ్లయింగ్ మెషీన్స్

విట్‌మన్, ఇంగ్లీషు తారలు సరామైల్స్, జేమ్స్, ఫాక్స్, టెర్రీథామస్, రాబర్ట్ మోర్లే, ఇటలీ నుంచి ఆల్‌బెర్టోసోర్డీ, జర్మనీ నుంచి గెర్ట్‌ఫ్రోబ్, ఫ్రాన్స్‌కి చెందిన జీన్‌పీర్‌రేకాస్సెల్, ఇరినాడెమిక్, జపాన్‌కు చెందిన యూజిరో ఇషిహారా ఉన్నారు. మిగతా పాత్రలలో శామ్‌వానా మేకర్, ఎరిక్ సైకెస్, బెన్నీహిల్, ఫ్లోరా రాబ్‌సన్, కారల్ మైకేల్ వోగ్లర్, టోనీ హేన్‌కాక్, రెడ్‌స్కెల్టిన్‌లు కన్పిస్తారు.

'దోజ్ మెగ్నిఫిషియెంట్ మెన్ ఇన్ దెయిర్ ఫ్లయింగ్ మెషీన్స్' టాడ్—ఏవోలో ఆకర్షణీయమైన డీలక్స్ కలర్‌లో తయారైంది. చిత్రం చూస్తున్న రెండు న్నర గంటలూ ప్రేక్షకులు తమను తాము మరచి చిత్రలోకంలోని గగన వీధుల్లో విహరిస్తారన్నది ఎంత మాత్రం అతిశయోక్తి కాదు!

ఈ చిత్రం సెయింట్ జార్జ్స్ స్కూల్ హోల్డ్ స్టూడెంట్స్ అసోసియేషన్ వారిచే ఆ స్కూల్, అనాధల సహాయార్థం మద్రాసులోని సఫైర్ థియేటర్‌లో సెప్టెంబర్ 1 వ తేదీ రాత్రి గం. 9—30 ని. లకు ప్రీమియర్‌తో ప్రారంభం అయి ప్రస్తుతం విజయవంతంగా నడుస్తున్నది.

—మాధవ్ ●

చిత్రసమీక్ష:

# పిడుగురాముడు

డి. వి. యస్. ప్రొడక్షన్సువారి సరికొత్త జానపదచిత్రం పిడుగురాముడు. 'రాముడు' అనే పేరుకు ముందూ వెనకా రక రకాల ఉడుపుల్ని తగిలించుకుని ఆ టైటిల్‌తో ప్రజాదరణ పొందిన చిత్రాలు అనేకం ఉన్నాయి అలానే యీ చిత్రంకూడా ప్రజల్ని తప్పకుండా ఆకర్షిస్తుంది.

మామూలుగా వచ్చే జానపద చిత్రాల్లానే యిందులో కూడా ఒక వాజెమ్మ అయిన రాజు ప్రతాప్ (రేలంగి), అతని రాణితమ్ముడు దుష్టుడైన గజేంద్రవర్మ (రాజనాల), రాజు గారికో అందాలకూతురుమధుమతి (రాజశ్రీ), వూరిలో సాధారణ పౌరుడు పిడుగురాముడు (యన్. టి. రామారావు) ఉన్నారు. గజేంద్ర వర్మకు తోడుగా అల్లు రామలింగయ్య, రాముడికి తోడుగా పద్మనాభం,..యింకా సహాయపాత్రధారులు మిక్కిలినేని, రాజ్‌బాబు, ఎల్. విజయలక్ష్మి, వాణిశ్రీ, మీనాకుమారి వగైరాలు వున్నారు.

గజేంద్రవర్మ బావగారి కళ్ళుమూసి రాజ్యమంతా విచ్చలవిడిగా తిరిగి వీరవిహారం చేస్తూ వచ్చిన కాపురాల్లో నిప్పులు పోస్తూ పన్నులు వసూలు చేస్తుంటాడు అతనికి పక్కలో — బల్లెమై కూర్చున్నాడు పిడుగు రాముడు. తన ఆట కట్టేయడమే కాకుండా పెళ్లి చేసుకో దలుచుకున్న అక్కకూతురు మధుమతిని కూడా చేజిక్కించుకొన్న రాముడ్ని చూస్తే గజేంద్రుడికి అరికాలి మంట నెత్తికెక్కింది అతన్ని చిత్రవధ చేయాలని సినిమా చివరిదాకా విఫల ప్రయత్నాలు చేస్తూనేవున్నాడు మనసుపడిన మధుమతి రాముడ్ని విడచి వుండలేకపోతుంది. వారి కలియకకు అంతరాయాన్ని కల్పిస్తాడు గజేంద్రుడు. చచ్చిపోయాడనుకున్న రాముడు అనేకసార్లు బ్రతకడంతో, మహారాజు తన



'పిడుగురాముడు'లో ఎల్. విజయలక్ష్మి

కూతురు మధుమతిని గజేంద్రుడికిచ్చి పెళ్లి చెయ్యాలనుకున్న సంకల్పం కూడా వికల్పమవుతుంది. చివర్లో తప్పు తెలుసుకున్న మహారాజుకు గజేంద్రుడిచేత కారాగారవాసం, రాకుమార్తెకు బందీ, ఆమెను వెదకబోయిన రాముడికి శిక్ష మిగుల్తుంది. ఇక్కడ చోటు చేసుకున్న యల్. విజయలక్ష్మి తనపాత్రను చక్కగా పోషించి రాముడికి ప్రమాదాన్ని తప్పిస్తుంది. రాముడు చెరను విడిపించుకుంటాడు. గజేంద్రుడితో ఘోరయుద్ధం చేసి అతని అంతం చూసింతర్వాత బహుభార్యాత్వానికి చట్టంలేని కాలంనుమాఅంటూ కథ ముగించే యీ చిత్రానికి దర్శకుడు విఠలాచార్య.

పైటవేయని పడుచు పైటు జారడంలోని శృంగారాన్ని పాడినప్పుడు, రాకుమార్తె మధు పరారయినప్పుడు ఆమెను పట్టిగిస్తే అర్ధరాజ్యం 'కాదు కాదు రాజ్యమంతాయిస్తా' నని ప్రతాప్ ప్రకటించినప్పుడు—రాముడు మధుతో రాజప్రసాదంలో అడుగెట్టి కూడా కథను అక్కడితో పూర్తి చేయడం యిష్టంలేక (అలాకాదని రాముడు మధుమతితో వేరే కారణం చెబుతో ప్రేక్షకుల అనుమానాన్ని పోగొడదామని యత్నిస్తాడు) మళ్లీ అడవుల్లో ప్రణయ కలాపాల్లో లీనమైపోయి అసలు కథను గుర్తు చేసుకోవడం లాంటివి కొన్ని యిబ్బెట్టుగా వున్నా, ప్రాస మీద ప్రాసవేస్తే సంభాషణ రక్తికడుతుంది, వినసొంపుగావుంటుంది, అనే ప్రేక్షకులకే కాకుండా, కావలసినన్ని కత్తియుద్ధాలు, శక్తియుద్ధాలకోసం సినిమాలు చూసేవాళ్లకి కూడా ఈచిత్రం వీనులకు కన్నులకు చక్కని పండుగ. ఆయుధప్రయోగాల్లోను, యుద్ధాల్లోను ప్రత్యేకత వుంది. రాజ్‌బాబు పాత్ర అనవసరమని పిస్తుంది. కథా గమనాన్ని తప్పుదార్లు పట్టించి మధ్యలో వట్టిపోయిన చిల్లర పాత్రలూ వున్నాయి యల్. విజయలక్ష్మి నృత్యాలు చూడతగ్గవి, '...గున్నమామిడి కాపు కాసిందోయ్' పాటలోని పేలవాన్ని విజయలక్ష్మి నాట్యం కప్పిపుచ్చింది.

ప్రత్యేకంగా చెప్పుకోతగింది—టి. వి.



'డాక్టర్ ఆనంద్' లో ఎన్ టి రామారావు, కాంచన

యస్ రాజాగారి సంగీతం వీతే, చెయ్యి తిరిగిన దర్శకుడి చేతిలో కథ మలుపు తిరిగిన చోటల్లా రక్తికట్టింది విశలాధార్యగారి దర్శకత్వం ప్రజలమీద అంజనం వేస్తుంది సెల్యులాయిడ్ ట్రిక్కులా, కథలో ట్విస్టులా ఆయన హాస్తలాఘవంతో బొమ్మ తిరుగుడు తిరుగుతాయి కథ నడుస్తున్నంతసేపూ ఎన్ని అనుమానాలు తలెత్తినా చివర్లో 'హాయ్' అనిపించే నేర్పు ఆయనలోవుంది ఆ కూర్పు ఈ చిత్రంలో వుంది వివిధ అభిరుచుల జనానికి ప్రపిదంలా పంచి పంతృప్తిపరచి 'దండుగలేదురా భాయ్' అనిపించి పంపించే యీ చిత్రం విజయవంతమవ్వద్నే ఆశిద్దాం

డి వి యస్ ప్రొడక్షన్స్ పేర నిర్మించిన యీ చిత్ర నిర్మాత డి వి యస్ రాజు రచనే నమ్ముద్రాల (జూనియర్) సంగీతం టి వి యస్ రాజు, పూర్ణాపిక్చర్స్ విడుదల

—సి కనకాంబరరాజు

## చిత్రలహరి

అన్నపూర్ణా వారి కార్యాలయంలో శ్రీ దుక్కిపాటి మధుసూదనరావుగార్ని యిటీవల కలుసుకోవడం జరిగింది ఆయన యీనెల 4న మద్రాసుకు వచ్చారు "పూలరంగడు" చిత్రానికి తారలను ఎన్నిక చేసే ప్రయత్నంలో ఉన్నారు చిత్ర నిర్మాణం యీ మాసాంతంలో ఆరంభమవుతుందనీ, రెగ్యులర్ షూటింగ్ వచ్చేనెల నుంచి జరుగుతుందనీ మధుసూదనరావు గారు తెలియజేశారు

* * *

శ్రీ ఆదుర్తి సుబ్బారావుగారు పరిచయం చేసిన కొత్త తారలంతా చిత్ర పరిశ్రమలో స్థిరపడినట్లేనని చెప్పవచ్చును ప్రధాన పాత్రల్లో పరిచయం కాబడ్డ కృష్ణ, రామ్మోహన్, సుకన్య, సంధ్యారాణీలకు యిపుడు బయటి చిత్రాలు అధికంగానే వస్తున్నవి పక్కభూమికలలో పరిచయం చేయబడిన పుష్పకుమారికి ఏ వి యం వారి కొత్త వర్ణచిత్రంలోనూ, ఎం వి చలపతిరావుకి భరణివారి "గృహలక్ష్మి" చిత్రంలోనూ చక్కటి వేషాలు లభించినవి కొత్తవారిని తారలుగా తీర్చిదిద్దిన శ్రీ ఆదుర్తి కృషి, శ్రమా ఫలవంతమయినవని చెప్పడంలో అసలబేమీ ఉండదనుకుంటాను

* * *

మన చిత్రాల నిడివి యింతవరకూ 16 లేక 17వేల అడుగులు (అంతకు) మించి ఉండేవి ఇపుడు నిర్మాతలంతా కలసి నిడివి 4000 మీటర్లు (సుమారు 13,000' అడుగులు)కు మించి ఉండరాదనే ఒప్పందానికి వచ్చినట్లు తెలుస్తున్నది

## మనసే మందిరం

నర్సింగ్‌హోమ్‌లో డాక్టర్ రఘు తన గదిలో కూచుని ఉన్నాడు వార్డుబాయ్ వచ్చి ఎవరో దంపతులు కాన్సర్ వ్యాధిని గురించి సంప్రదించే నిమిత్తం వచ్చారని చెప్పాడు లోనికి రమ్మన్నాడు వచ్చిన వాళ్ళను చూసి రఘు నిర్ఘాంతపోయాడు దంపతుల్లో స్త్రీ కూడా కొయ్యబారిపోయింది ఆమె పేరు సీత కాన్సర్ రోగి రాముకు భార్య అతనికి చికిత్స చేయించాలనే యిక్కడకు తీసుకువచ్చింది వారివద్ద నున్న ఎక్స్‌రే కాగితాలు చూశాడు రఘు కొందరు డాక్టర్లను పిలిచి రాము వ్యాధి ఏ పరిస్థితిలో వున్నదీ సంప్రదించాడు చాలా అపాయకరమైన వ్యాధి అన్నారు డాక్టర్లు వాళ్ళను పంపి మళ్ళీ తన గదిలోకి వచ్చి ఆలోచిస్తూ



"మనసేమందిరం"లో జగ్గయ్య, సావిత్రి



"మనసే మందిరం" లో సావిత్రి, నాగేశ్వరరావు

# చిత్రలహరి

చూస్తున్నాడు రఘు ఒకనాడు తనది అను కొని అన్యుడి ఇల్లాలుగా వచ్చిన సీతకు— ఆమె భర్త వ్యాధి తీవ్రతను గురించి ఆమెకు ఎలా చెప్పాలనే అతడి యోచన ఈలోగా సీత రానేవచ్చింది "మీరే ఇక్కడ డాక్టరని, మీవద్దకే నా భర్తను తీసుకురావలసి వస్తుందనీ అనుకోలేదు డాక్టర్!"

"తెలిస్తే వచ్చేవారు కాదా?" అడిగాడు బాధపడుతూ

"తప్పక వచ్చేదాన్ని మీరు ఉత్తము లని, ఉన్నతాదర్శాలున్న వారనీ నాకు నమ్మకం ఉంది ఆ నమ్మకం ఎన్నటికీ మారదు డాక్టర్!" ఆమె నమ్మకానికి రఘు కళ్ళలో నీళ్ళు నిలిచినవి బరువయిన ఈ సన్ని వేశంలో డాక్టరు రఘుగా నాగేశ్వరరావు, సీతగా సావిత్రి, కేన్సర్ రోగి రాముగా జగ్గయ్య నటించారు ఇంకా యీ చిత్రంలో గుమ్మడి, రేలంగి, చలం, నాగభూషణం, గిరిజ, శారద, నిర్మల, బేబిశాంతికళ కూడ ఉన్నారు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం శ్రీధర్

## సత్యమే జయం

మాల తీయని అనుభూతి లతో తేలిపో తున్నది రాజా నవ్వుతూ దగ్గరకు వచ్చాడు మాలా అతన్ని హృదయానికి హత్తుకున్నది రాజా తన్మయం పొంది పిలిచిపోతాడు 'దాంకిపోయావ్, నా హృదయంలో నిన్ను దాచుకున్నాను ఇంకెక్కడికీ పారిపోలేవు' అన్నది అతని కన్నుల్లోకి చూస్తూ రాజా నవ్వి "ఇంకెటు పోగలను" అన్నాడు తృళ్ళి పడ్డది తేరి చూసింది అతడి కౌగిలి నుంచి విడిపించుకొని పారిపోబోయింది అతడు ఆమె చెయ్యి పుచ్చుకులాగాడు. "వదలండి కన్ను వదలండి" అన్నది మాలా సిగ్గు ముంచెత్తుకురాగా. "నీ స్వప్నం చెడగొట్టా నని కోపమా?" లాలనగా అడిగాడు. "ఎందు కొచ్చారిక్కడికి? ఏంకావాలి?" అన్నది. "కావలసిందేదో అందుకున్నాను. అర్థం కాలేదా? నా హృదయం నీ దగ్గర విడచి పోయాను, అందుకే నిన్ను చూద్దామని వచ్చాను. నీ హృదయం నా [illegible] కర్పించావని తెలుసుకున్నాను. ఇకమీద నేను నీ నీడలో నీ చెంతనే వుంటాను" అన్నాడు. "నీడ యెంత చెంతనున్నా చిమ్మ చీకటి కమ్ము కొస్తే ఆ చీకట్లో కలిసి మాయమై పోతుంది." "మన బ్రతుకుల్లో చీకటి వుండదు మాలా! నిత్యం వెన్నెలే నీ సహ్రత్తో నా జీవితమే వెలిగిపోతుంది" ఇదీ రాజా చెప్పాడు రాజా ఇందిరామరణ పిక్చర్స్‌వారి "సత్యమే జయం" చిత్రంలోనిది సన్నివేశం మాలాగా రాజశ్రీ, రాజాగా శోభన్‌బాబు ఇందులో నటించారు రచన జి కె మూర్తి, దర్శకుడు పి వి రామారావు



'ధనంజయ్' మరాఠీ చిత్రంలో పాత్ర ధరించిన సంగీత దర్శకుడు సి. రామచంద్ర

## విజయరాముడు

డాక్టర్ శ్రీ ఇ అప్పారావు జయాప్రొడ క్షన్స్ పతాకం క్రింద "విజయ రాముడు" అనే జానపద చిత్రం నిర్మించేందుకు ఏర్పాటు చేస్తున్నారు ఈ చిత్రం ద్వారా మరో కొత్త రచయిత సినిమా రంగానికి పరిచయం అవుతున్నారు ఆయన పేరు శ్రీ వేటూరి సుందరరామమూర్తి కథకుడుగా, పత్రికా రచయితగా ఆయన విశేష మయిన అనుభవం వున్న వ్యక్తి రాజశ్రీ, కాంతారావు, రాజనాల, మిక్కిలినేని, బాల కృష్ణ, హేమలత, మీనాకుమారి ఇంత వరకు ఎన్నుకోబడినారు దర్శకుడు అమంచర్ల శేషగిరిరావు

## కలసిన మనసులు

ఎల్ ఆర్ ప్రొడక్షన్స్ అనే నూతన చిత్రనిర్మాణ సంస్థ "కలసిన మనసులు" అనే సాంఘిక చిత్రం నిర్మించనున్నది గత నెల మధ్యభాగంలో అరుణాచలం స్టూడియోలో యీ చిత్రం తాలూకు రెండు గీతాలు రికార్డు చేశారు శ్రీశ్రీ వ్రాసిన యీ గీతాలు సంగీత దర్శకుడు సత్యం ఆధ్వర్యంలో పి సుశీల, పి బి శ్రీనివాస్ ఆలపించారు కృష్ణకుమారి, కాంతారావు, రాజనాల, రాజ్ బాబు, పద్మశ్రీ నాగయ్య ప్రభృతులు నటించే యీ చిత్రానికి దర్శకుడు బి యస్ నారాయణ

## భేతాళ మాంత్రికుడు

భాగ్యలక్ష్మి ఫిలిమ్స్‌వారి "భేతాళ మాంత్రికుడు" చిత్రం రెండవ షూటింగుషెడ్యూలు యీనెల 15 నుంచి వీనస్ స్టూడియోలో ఆరంభం కానున్నది భారీయెత్తున నిర్మించబడుతున్న యీ చిత్రం దీపావళికి విడుదల చేయాలనే సన్నాహంలో ఉన్నారు యస్ వి. రంగారావు, రేలంగి, గుమ్మడి, కాంతారావు, రాజశ్రీ, గిరిజ, సూర్యకాంతం, రామనలో చన ప్రధాన భూమికలు పోషిస్తున్నారు. సంగీతానికి చిత్రంలో విశేష ప్రాధాన్యత ఉన్నది సంగీత దర్శకుడు ఎం ఎస్. ప్రకాష్, దర్శకుడు వేదాంతంరాఘవయ్య రచన సదాశివబ్రహ్మం

—మోహన్ కుమార్

# పుస్తకాలు

## స్పెయిన్ ఎట్ ఎ గ్లాన్స్

స్పానిష్ ఇన్‌ఫర్ మేషన్ సర్వీస్ వారు ఆంగ్లంలో ప్రచురించిన యీ గ్రంథం సంగ్రహంగా స్పెయిన్ స్వరూపాన్ని మన కళ్ళముందుంచుతుంది. స్పెయిన్ భౌగోళిక నైసర్గిక స్వరూపము, స్పెయిన్ గురించిన పూర్వ ప్రస్తుత చరిత్ర, సంఘము — సాంఘిక జీవనం, సాంప్రదాయము, ఆచార వ్యవహారాలు, ఆహార పానీయాలు, నాగరికత, ప్రభుత్వము — పరిపాలన, విదేశీ రాజనీతి, విద్య — వివేకము, సంస్కృతి — విజ్ఞానము, ఆర్థికస్థోమత ప్రాతిపదికగా పది శీర్షికలు, వివరంగా మరికొన్ని ఉపశీర్షికలతో, 'నాటి చరిత్ర, నేటి అభ్యుదయం, రేపటి భవిష్యత్తు'— ఈ అంశాలలో దేశం సాధించిన, సాధిస్తున్న లక్ష్యాలపై సంక్షిప్తమైన కూర్పు యీ పుస్తకం. సుందర ప్రకృతి సంపద, జాతి జీవన ప్రతిబింబితాలైన కట్టడాలు, పట్టణాలు, తదితర రమణీయ దృశ్యాలు రంగురంగుల చిత్రాలతో పూర్తి గ్లేజ్ పేపరు ముద్రణ ఎంతో హాయిగా వుంది. వివరాలొత్తి యివ్వబడిన దేశపటాన్ని చూసి, ఒక్కసారి ఈ పుస్తకంలోని 155 పేజీల గ్లేజ్ పేపర్ని తిరగేస్తుంటే స్పెయిన్ మన కళ్ళముందున్న అనుభూతి కల్గుతుంది.

60 పెసిటాల (స్పెయిన్ ద్రవ్యమానం) విలువగల యీ పుస్తకం స్పానిష్ ప్రచారశాఖతో సంప్రదిస్తే లభిస్తుంది.

## అమెరికాను గురించి నా కలలు

శ్రీ లిండన్ జాన్సన్ రచించిన ''మై హోప్ ఫర్ అమెరికా'' తెలుగు సేత ఈ పుస్తకం అనువాదకుడు శ్రీ యర్రంనేని వెంకట్రావ్ అమెరికాను అభ్యుదయ పథంలో నడిపించడానికి గాను లిండన్ జాన్సన్ కంటున్న కలలు వాటికి అనువైన వాతావరణం ఈ పుస్తకంలో యివ్వబడింది. అనువాదం సరళంగా వుండడం చేత చదవాలనిపిస్తుంది. శాంతికోసం తన అధ్యక్షపదవిని అంకితం చేస్తానన్న శ్రీ జాన్సన్ కలలు తెలిసికో తగ్గవిగా వున్నాయి. జాన్సన్‌కు సంబంధించిన ఎనిమిది ఫోటోలతో, చక్కని గెటప్‌తోను అలంకరింపబడ్డ ఈ 112 పేజీల పుస్తకం వెల రెండు రూపాయిలు.

ప్రాప్తిస్థానం ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు, సికిందరాబాదు

## విరిగిన కల్చర్

శ్రీ రంధి సోమరాజు కలం నుంచి వెలువడ్డ 'తన ఆత్మకథా గేయం'తో పాటు మరిన్ని గేయాలుగల యీ 84 పేజీల పుస్తకంలో మరింత విరిగిన కల్చరుంది. 'పార్కు సుందరి వంటినిండా గజ్జిలా వేరు సెనగ పొట్టు' లాంటివి చదవడానికెంత యింపుగా వుండవో, ''పచ్చి గడ్డి ఆవును తినేసి మాంసం దుకాణం పెట్టింది' లాంటి అంత అయోమయం కూడా యీ పుస్తకంలో వుంది. 'స్వంత శైలి కావాలనుకున్న గాఢవాంఛతో' 'మాట పొందికల సానమీద మంచి గంధం తీసి' 'వెధవ వీగ్రో తుమ్మెదల్లాంటి' విరిగిన కల్చర్ తన ప్రత్యేకతను నిల్పుకుంటుందనే చెప్పాలి. పదసారధ్యంలో ఒడిదుడుకులు లేకుండా తక్కువ మాటల్లో ఎక్కువ భావాన్ని పొందు పరచి, తాను చెప్పింది పఠితల్లో ఆలోచనాశక్తిని రేకెత్తించే విరిగిన కల్చర్ వెల రెండు రూపాయిలు. దొరికే చోటు శశిధర్ పబ్లికేషన్స్, కేరాఫ్ రంధి సోమరాజు బి యే, అన్నపూర్ణ పేట, రాజమండ్రి 3

## సూర్యకిరణాలు

శ్రీ కాట్రగడ్డ లక్ష్మి నరసింహారావు సంకలనం చేసిన పదిహేనుగురు రచయితల గేయాలు 16 పేజీలుగల యీ పుస్తకంలో వున్నాయి. ఏరకంగా చూసినా సాహిత్యపు విలువలకి నిలవగల గేయం ఒక్కటీ యిందులో లేదు. ఈ పుస్తక ప్రచురణ గేయ రచయితల్ని ప్రోత్సహించే తమ తొలి ప్రయత్నమన్నారు సంకలన కర్త. నవ రచయితల్ని ప్రోత్సహించడం అభిలషణీయమైన కృషి. త్వరలో వెలువరించే రెండవ ప్రచురణ కొంచెమైనా చదువదగిందిగా వుంటుందని ఆశిద్దాం.

ప్రతి వెల 35 పైసలు ప్రతులకు శేష గోపాల్ పబ్లికేషన్స్, అమీనా పేట, ఏలూరు

## శ్రీ కన్యకా సుప్రభాతమ్

శ్రీ జమిలి నమ్మాళ్వారు రచించిన వైశ్య కుల దేవత శ్రీ కన్యకా పరమేశ్వరి సుప్రభాతమిది. 32 పేజీలుగల యీ పుస్తకంలో 27 సంస్కృత శ్లోకా లున్నాయి. ఒక్కొక్క శ్లోకం ఒక్కో పేజీలో తెలుగు, తమిళ, నాగరి లిపుల్లో ముద్రించి తెలుగు వ్యాఖ్యానంతో ఆంధ్రులకు ప్రత్యేక సౌకర్యాన్ని కలిగించారు రచయిత. పాఠకుల హృదయాల్లో భక్తి పారవశ్యాన్ని కలిగించే ధ్యేయంతో సరళమైన శైలిని ఉపయోగించి వ్రాసిన యీ సుప్రభాతమ్ రచయిత ఆశయాన్ని నెరవేరుస్తుంది.

వెల 50 పైసలు ప్రాప్తిస్థానం. శ్రీ జమిలి నమ్మాళ్వారు, గుంటూరు.

## చీకటి దీపాలు....!

'కుష్ఠువ్యాధి— బిచ్చగాళ్ళ సమస్యల్ని' దృష్టిలో ఉంచుకుని మాష్టర్ రవి రాసిన 17 పేజీల వ్యాసమిది. వికృతంగావుండే కుష్ఠురోగుల్ని చూసినపుడు వళ్ళు జలదరిస్తుంది. వాళ్ళను చూడ్డానికైనా మనస్కరించదు. వాళ్ళను గురించిన ఈవ్యాసాన్ని చదివింతర్వాత రచయిత అన్నట్లుగానే ఈ వ్యాధి పట్ల వుండే దురభిప్రాయం పూర్తిగా మాసిపోకపోయినా, ఒక విధమైన సానుభూతి కల్గుతుంది. చివర్లో బిచ్చగాళ్ళ సమస్యా పరిష్కారానికి కొన్ని మార్గాలుకూడా యివ్వబడ్డాయి. మాష్టర్ రవి కృషి ప్రశంసనీయం.

అమూల్యమైన యీ పుస్తకం దొరికేచోటు: ఆంధ్ర ఆశాజ్యోతి ప్రచురణలు. రాజాం; శ్రీకాకుళం జిల్లా.

## ప్రతిజ్ఞా గాంగేయము

శ్రీ శైవ విద్యాశంకరుడు రచించిన పద్య కావ్య మిది. తండ్రి ఆనందంకోసం తన సర్వసుఖాన్ని పరిత్యజించిన భీష్ముని చరిత్ర రమ్యమైన పద్యాల్లో చెప్పబడింది. ఇది ప్రథమ భాగమని విజ్ఞాపనంలో పేర్కొన్నారు రచయిత. ప్రథమ భాగాన్ని చదివిన వారు తప్పకుండా తక్కిన భాగాలకోసం ఎదురు చూస్తారు. ధారాశుద్ధి బాగుంది. అందమైన పదబంధం పద్యాల్లో గుప్పించి రచనలో వైశిష్ట్యాన్ని పోషించారు.

36 పేజీలు గల యీ పుస్తకం వెల ఒక రూపాయి, ప్రతులకు గాంగేయ కవితా మండలి, విజయవాడ

## విలువతగ్గిన మనరూపాయి....

శ్రీ యామా నర్సయ్య రచించిన 'విలువ తగ్గిన మన రూపాయి, విలువ పెరుగుటకు ఉపాయం' అన్న పది పేజీల వ్యాసమున్న పుస్తకమిది. పుస్తకం పేరు లోనే గ్రంథస్థమైన విషయం సుబోధక మవుతుంది. నాణాల చరిత్ర దగర్నుంచి రూపాయి విలువ తగ్గింపు వరకు క్లుప్తంగా యీ వ్యాసంలో చర్చించబడింది.

వెల తెలియదు. ప్రకాశకులు మంత్రి ఆర్య సమాజము, సూర్యాపేట, నల్గొండ జిల్లా.

## రాగ జ్వాల

కొడాలి గోపాలరావు రచించిన 28 పేజీల నాటిక. ఇందులో మూడు పురుష పాత్రలు, రెండు స్త్రీ పాత్రలు ఉన్నాయి. ప్రేమించిన పడతి మరొకరిని పెళ్లి చేసుకున్నప్పుడు ఆ ప్రేమించిన దాన్ని, పెళ్లి చేసుకున్న వాడ్ని నానా యాతనలూ పెట్టి చివరికి తాను పొడుచుకు చచ్చిపోయిన ఒక అవిటివాడైన భగ్న ప్రేమికుని ఇతివృత్తం. అనురాగాల మధ్య పరిస్థితుల ప్రభావం ఎంతగా పనిచేస్తుంది యీ నాటిక చెబుతుంది. సంభాషణల్లో కథ నడిచిన యీ నాటిక వెల 75 పైసలు. ప్రతులకు విశాలాంధ్ర ప్రచురణాలయం విజయవాడ—2.

## తెలుగు వెలుగు

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి జన్మదినాన్ని పురస్కరించుకుని ప్రత్యేక సంచికగా వెలువడ్డ జులై, ఆగస్టు నెలల తెలుగు వెలుగు సచిత్ర మాసపత్రిక మా కార్యాలయం చేరింది. ఇందులో ప్రముఖుల వ్యాసాలు కథలు ఉన్నాయి.

వెల 50 పైసలు, చిరునామా తెలుగువెలుగు విజయవాడ—2 సి కనకాంబరరాజు ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

